రామకృష్ణమాచార్యులు, ధర్మవరం,
1853-1912

ప్రహ్లాదనాటకము

బళ్ళారి, 1927

Record no. 368

Rāmakṛṣṇamācāryulu,
Dharmavaraṃ, 1853-1912

Prahlādanāṭakamu

Baḷḷāri, 1927

Record no. 368

Bibliographic Record Target

రామకృష్ణమాచార్యులు, ధర్మవరం, 1853-1912.
ప్రహ్లాదనాటకము / ధర్మవరం - రామకృష్ణమాచార్యులచేత రచియింపఁబడినది.- 6. కూర్పు.- బళ్ళారి : రమావిలాస ముద్రాక్షరశాల, 1927.
(2),72 p. :port. ;21 cm.
Record no. 368

Rāmakṛṣṇamācāryulu, Dharmavaraṃ, 1853-1912.
Prahlādanāṭakamu / Dharmavaraṃ - Rāmakṛṣṇamācāryulacēta raciyimpam̐baḍinadi.- 6. kūrpu.- Baḷḷāri : Ramāvilāsa Mudrākṣaraśāla, 1927.
(2),72 p. :port. ;21 cm.
Record no. 368

THE 

# Prahlada Natakam.

A TELUGU DRAMA IN FIVE ACTS.

Composed by the Late

D. KRISHNAMA CHARLU

"Andhra Nataka Pithamaha"

SIXTH EDITION

...n. & Bros.

...y.



PRICE Re. 1-0-0.

శ్రీ

# ప్రహ్లాద నాటకము.

"ఆంధ్ర నాటక పితామహ" యను బిరుదువహించిన


## ధర్మవరం - రామకృష్ణమాచార్యులచేత.


రచియింపఁబడి

డి. కె. కృష్ణమాచార్లు, వారి సహోదరుల వలనఁ

ప్రకటింపఁబడియె.



[illegible]


బళ్ళారి

రమావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.




1927




[క్రయము రూ. 1-0-0]

## ఈనాటకమునందలి ముఖ్యపాత్రలు—తత్ప్రవేశస్థలములు.

### పురుషులు.

హిరణ్యకశిపుఁడు—అం I రం 4, 5. అం II రం 1, 2, 4, 5. అం III రం 1, 2, 4 అం IV రం 2. అం V రం 1, 4.

ప్రహ్లాదుఁడు—అం II రం 4, 5. అం III రం 1, 2, 3, 4. అం IV రం 1, 2, 3, 4, 6. అం V రం 1, 2, 4.

ఇంద్రుఁడు—అం I రం 1, 2. అం II రం 2, 3. అం V రం 4.

బ్రహ్మ—అం I రం 3, 4. అం V రం 4.

నారదులు—అం I రం 2, 5. అం IV రం 1, 2. అం V రం 4.

బృహస్పతి—అం II రం 1, 3.

శుక్రాచార్యులు—అం III రం 1. అం IV రం 2, 3. అం V రం 4.

విష్ణువు—అం II రం 1, 3.

నృసింహామూర్తి—అం V రం 4.

కాలనాభుడు—అం IV రం 1, 2, 4.

అగ్ని—అం I రం 1. అం II రం 2.

యమ—అం I రం 1. అం II రం 3.

వరుణ—అం I రం 1. అం II రం 2.

బాలురు—అం III రం 3. అం IV రం 4, 5. అం V రం 3, 4.

### స్త్రీలు.

లీలావతి—అం I రం 2, 5. అం II రం 4, 5. అం III రం 3, 4. అం IV రం 2. అం V రం 1.

లక్ష్మీదేవి—అం II రం 1, 4. అం V రం 4.

సరస్వతి—అం V రం 4.

అచ్చరలు—అం I రం I అం II రం 2.

రాక్షసభటులు సేవకులు.

## కథాసంగ్రహము.

### ప్రథమాంకము.

రం. 1. హిరణ్యకశిపుడు తపస్సుచేయుచు మృతిపొందెనని రంభ దేవేంద్రునితో చెప్పుట.

రం. 2. దేవేంద్రుడు చెరపట్టియున్న లీలావతిని (హిరణ్యకశిపుని భార్య) నారదుడు పోషించుట.

రం. 3. హిరణ్యకశిపుని తపోగ్ని సత్యలోకమున బ్రహ్మనజను వ్యాపించుట.

రం. 4. బ్రహ్మ హిరణ్యకశిపునికి వరములిచ్చుట.

రం. 5. నారదుడు లీలావతికి భక్త్యుపదేశము చేయుట హిరణ్యకశిపుని సమాగమము.

## ద్వితీయాఙ్కము.

రం. 1. హిరణ్యకశిపుడు వైకుంఠములో నల్లకల్లోలము చేయుట.

రం. 2. హిరణ్యకశిపుడు దేవేంద్రుని పారదోలి స్వర్గముగైకొని తీవ్రమైన శాసనము లిచ్చుట.

రం. 3. ఇంద్ర బృహస్పతులు విష్ణువుతో మొరపెట్టుకొని వాగ్దానము గైకొనుట.

రం. 4. 2-3 సంవత్సరముల బాలుడైన ప్రహ్లాదుని లీలావతియాడించుట ప్రహ్లాదుని విష్ణుభక్తి.

## తృతీయాఙ్కము.

రం. 1. 3-4 సంవత్సరములబాలుడైన ప్రహ్లాదునిహరిభక్తికి హిరణ్యకశిపుడాశ్చర్యపడి శుక్రాచార్యులతో నాలోచించుట.

రం. 2. 4-5 సంవత్సరముల వయస్సుగల ప్రహ్లాదుని భక్తి.

రం. 3. 6-7 సంవత్సరముల వయస్సుగల ప్రహ్లాదుడు పాఠశాలలో చదువుట. అతని మనోదార్ఢ్యమునకు చండామార్కులు ఆశ్చర్యపడుట.

రం. 4. లీలావతీ హిరణ్యకశిపులు ప్రహ్లాదునిరావించుట. ప్రహ్లాదుని వేదాంతము. హిరణ్యకశిపు నాగ్రహము. లీలావతిబోధ. ప్రహ్లాదుని కొండపైనుండి దిగువకుద్రోయుటకాజ్ఞకలుగుట. (దీర్ఘమైన, మనోహరమైన, రంగము).

## చతుర్థాఙ్కము.

రం. 1. ప్రహ్లాదుని గిరిపతనము. నారదసమాగమము.

రం. 2. తనకు చావుగలిగెననియెంచి పరితపించు తలిదండ్రుల ప్రహ్లాదుడుచేరుట. హిరణ్యకశిపు మహాగ్రహము. లీలావతి ద్వితీయోపదేశము, శుక్రుడు తానే ప్రహ్లాదునికి మంచివిద్యచెప్పుటకు పూనుట.

రం. 3. బడిబాలురకు ప్రహ్లాదుడాచార్యుడగుట (భక్తిరసప్రధానరంగము).

రం. 4. ప్రహ్లాదుని సముద్రమున ముంచ ప్రయత్నము. బాలుర కృతజ్ఞత.

రం. 5. బడిబుడుతలయాలోచన.

రం. 6. ప్రహ్లాదుని పాములచే కఱపించుట.

## పంచమాఙ్కము.

రం. 1. ప్రహ్లాదుడు విషమును రసాయనమువలెత్రాగుట.

రం. 2. ప్రహ్లాదుని నేనుగులతో ద్రొక్కించి యగ్నిలోవైచుట.

రం. 3. ప్రహ్లాదశిష్యుల నిర్ధారము.

రం. 4. నృసింహావతారము. హిరణ్యకశిపు మరణము. ప్రహ్లాదునికథయును.

❖: మ ం గ ళ ం. :❖



**Bellary. D. KRISHNAMA CHARLU,**

**Andhra Nataka Pithamaha,**

Born 1853—Died 1912.

శ్రీ

# ప్రహ్లాద నాటకము.

## ప్రథమాఙ్కము - ప్రథమరంగము.

### ఇంద్రసభ.

**ప్రవేశము: ఇంద్ర-అగ్ని-యమ-వరుణ-నైఋతి.**

ఇంద్ర—దిక్పాలవరులారా! రంభాదులిన్నిదినములయ్యె నదేలనో రాకయున్నారు. కార్యసాఫల్యము కలిగెనో లేదో తెలియకయున్నది.

అగ్ని—దేవేంద్రా! మనకేల యీయోచన? హిరణ్యకశిపుఁ డెట్టి తపముఁజేసినను మనకేమికొదవ. వానిచేత మనము తడవుకొనవలయును? అంతప్రయత్నించి వాని తపస్సంతయు నిర్వహించి వరములంబడసి నాకమేమైన నాక్రమింపవచ్చునా? అయ్యాదివిష్ణువు మనకు బాసటముగా నుండువఱకు మనకేకొదవఁగలుగనేరదు.

వరుణ—అటుకాదు. వానిసోదరుఁడు హిరణ్యాక్షుఁడు భూమినంతయు చాపకట్టుగా నెత్తికొనిపోఁబట్టెగదా వానినిసంహరించుటకై యాదివిష్ణువొకయవతారము నెత్తవలసివచ్చె. వరాహరూపమునఁబూని సంహరింపవలసివచ్చె. ; హిరణ్యకశిపుఁడిపుడు సోదరుని చావువలనఁ గలిగిన పగఁబనిఁబూని ఘోరతప[illegible]చున్నాఁడు. కోర్కె వరములేవైన పొందెనా వాని నిర్జించుట యసాధ్యము[illegible]

యమ—అంతకువచ్చిన నామహావిష్ణు నింకొక యవతారమే యెత్తుగాక. [illegible] మము రక్షింపఁగలడు.

**[ప్రవేశము: రంభ-మేనక-మొదలగువారు.]**

ఇంద్ర—అప్సరోవతంసములారా! సాధించితిరా?

రంభ—దేవేంద్రా! సాధించుటయేమి! సాధించుటకంటె నెక్కుడవైనది.

ఇంద్ర—అదియేమి? నీమాట యాశ్చర్యకరముగానున్నది.

రంభ—మాకేమియు శ్రమ యొసంగకయే యాహిరణ్యకశిపుఁడు మృతిబొందెను.

ఇంద్ర—ఏమి? ఏమి! తపమొనర్చువాఁడెట్లు మృతిబొందెను.

రంభ—మేము పోవుటకుముందే చచ్చియుండె.

ఇంద్ర—అదెట్లుతెలిసెను?

రంభ—చూచియే వచ్చియున్నారముగదా! కన్నులుమూతవడి యొడలుచల్లఁబడి శవమై యుండెను. మొట్టమొదట నింకను తపమొనర్చుచున్నాఁడనియెంచి వానియెదుట నాట్యమును గానము నెంతో యొనర్చితిమి. ఒక్కింతైన కనువిప్పఁడయ్యె. శరీరమంతయు పుట్టలు పెట్టినట్లు మంటితో నిండి తలమాత్రము కన్పించుచుండె. ఇంచుకైన చలనములేకయుండె. కొన్నిదినములు భీతిల్లియుండి మేము దవ్వుదవ్వులనే సంవిధానములనొనర్చితిమి. ఏమియు కదలకున్నందున తుదకు ధైర్యమున వానిమోమంటితిమి. శవమునకున్న విధానమున చల్లనీళ్లుగల మృత్పాత్రయున్నట్లుండె. శరీరము నిండియున్న మంటినిఁద్రవ్వి శరీరము నంతతాకితిమి. అదియు మంచుగడ్డపై చేయిపెట్టినట్లుండె. పదిగడియలవఱకు నూపిరియున్నదాయని పరీక్షింప నించుకంతయుఁ గానరాదయ్యె. శవమునుఁబాసి దానితో నేమిపనియని యిటువచ్చితిమి.

## అనుబంధము 1.

ఇంద్ర—వనితామణులారా! ఎంతసంతోషవార్తఁదెచ్చితిరి. అయిన నాకింకను సంశయమొదవెడు. మృతిజెందినవాఁడైయున్నఁ గూర్చొని యెట్లుండెను?

రంభ—అదియేమాశ్చర్యము! తపమొనర్చుచుండఁగా గాలికి నూరకశరీరముపై మన్నుపడి కంఠమువరకుఁ బూడుకొనెను. తరువాత మృతిజెందె. కూర్చుండియుండుట కేమభ్యంతరము! ప్రాణమున్న నూపిరియుండదా! నాడులుండవా! ముక్కున నావియుండదా? ఒడలు వేడియుండదా?

వాణి—దేవేంద్రా! [illegible]నిష్ఠులగువారు తపమొనర్చుచు మృతిఁజెందిన విధాన మిదివఱకు నెందును వినము. ఇ[illegible]చిత్రముగానున్నది.

ఇంద్ర—వీరు చూచియే వచ్చియున్నారుగదా? ఇంకేటిసంశయము? మృతిజెందియుండెనో సరియేకదా, చావకున్న నింకకొన్నినాళ్ళకైనఁ జావఁగలడు. ఎట్లు నివార్త సంతోషజనకము. అప్సరోవతంసములారా! మీరుతెచ్చియున్న యీసంతోషవార్తవలన నాకుపరమానందముజనించె. ఇంకముందు కార్యముల యోచింపవలయు. దిక్పాలకులారా! ఆరాక్షసుని భార్యయగు లీలావతి యెన్నినాళ్లనుండియో గర్భము ధరించి పెంచుచున్నది. ఆపుట్టగలవాడెట్టి క్రూరాసురుడగునో వాఁడు వృద్ధిజెందకమునుపే వాని సంహరించుటమేలు. నే దండయాత్రవెడలి యారాక్షసునిపురము నాక్రమించి లీలావతినిఁ జెరపట్టుకొనిచ్చి యీసురపురిని నిలిపెద. ఆమె ప్రసవించిన వెంటనే యాశిశువునుఁ జక్కాడెత. రంభాదులారా! ఎది! యీసంతోషకాలమున మీనాట్యమింత తిలకింతము.

(రంభాదులు నాట్యమొనర్తురు).

(అందఱు నిష్క్రమింతురు)



## ప్రథమాఙ్కము-ద్వితీయరంగము.

—:o:—

### అరణ్యము.

[ప్రవేశము: దేవేంద్రుఁడు-లీలావతి]

## అనుబంధము 2. ×

లీలా—ఆహా! నన్నుఁగాపాడు పుణ్యాత్ములెవ్వరును లేరే. ఈదురాత్ముఁడొనర్చు పరిభవమువలన నను దప్పించు కరుణాకరుఁడు లేడే, హా! దైవమా! (ఇంద్రునిజూచి) దురాత్మా! నీకా దేవేంద్రపదము నెవ్వరొసంగిరి? అనదయై, య[illegible], యరక్షకయైయున్న యువతీమణిపై పౌరుషముఁజూపు. క్రూరుఁడవు నీవొకవీరుఁడవా? పందా! నాపతియున్న వేళ నీవురావలసినయుండె. అప్పుడు నీవేమైన నిలుచుచుండెనేమో చూచియుండువు. అసంయుక్తపతికనైయున్న నన్నునిర్బంధించు దౌరాత్మ్యమును నిన్నేమనవలయు?

ఇంద్ర—అమ్మా! లీలావతీదేవీ! నీకేమియు నే నపకారముఁగావింపను. నిను బాధింపను. నిను కన్నెత్తియైనఁజూడను. సముచిత పతివ్రతాతిలకమవని నుతికెక్కియున్న నీకు నీడొనర్చు దురాత్ముఁడుండునే? అయిన మమ్మెల్లర నెల్లవేళల బాధించుచుండిన నీపతి యంతరించియుండ నీగర్భమున నెట్టిక్రూరుఁడు [illegible]యను సంశయమున నీప్రసవమువఱకుమాత్రము నిన్నుఁజెఱయందుంచెద.

లీలా—అయ్యో! దురాత్మా! నీకిట్టిదుర్బుద్ధియా? అపరాధమునుమాట యింకైన యెఱుఁగని కసిగందువును సంహరింపనెంచితివా? నీవనాథయువతుల బాధించు పందవనుటమాత్రము కాదయ్యె. నోరెఱుఁగని శిశువుల వధింపనెంచు పాపాత్ముఁడవు సహితమగుదువే. ఛీ! నీప్రభవమేటికి? నీపురుషజన్మమేటికి?

[ప్రవేశము: నారదుఁడు.]

## అనుబంధము 3. X

ఇంద్ర—నారద ఋషులకు వందనము. ఎక్కడనుంచి విచ్చేయుట. (నమస్కరించును)

లీలా—(నమస్కరించి) మహాత్మా! ఋషితిలకా! నీవైన రక్షింపుము. చూడుము. ఈభీరుడన్యాయముగ ననుఁ జెఱపట్టియున్నాఁడు.

నారద—దేవేంద్రా! ఎవ్వరీతరుణీమణి?

ఇంద్ర—నారదా? నీవుచూడలేదా? దురాత్ముడగు హిరణ్యకశిపుమహిషి. లీలావతి.

నారద—ఆమె యిక్కడి కెట్లువచ్చె?

ఇంద్ర—చెఱవట్టి నే దెచ్చితి.

నారద—అట్లయిన దేవేంద్రా! నినుంబోలిన శూరులు లోకమున నుండరు. మహాశక్తిసమన్వితుఁడగు హిరణ్యకశిపుని మహాఘోరరణమున జయించి యతని సతినిం జెఱవట్టితివిఁగదా?

లీలా—ఋషితిలకమా! యుద్ధమా! నిరుద్ధమా. నీచాత్ముఁడు అసంయుక్తపతికనై యున్న నన్నన్యాయముగ నిర్బంధించె. నాపతి ఘోరతప మొనరించుచున్నవాఁడు. అతని కాలిగోటికైన శిరమునధరించు యోగ్యత యీపాపకర్మునకుఁగలదా?

## అనుబంధము 4.

నారద—శ్రీనా? దేవేంద్రా! నీవా హిరణ్యకశిపుని యుద్ధభూమిని జయించలేదా!

ఇంద్ర—మునీంద్రా! తపమొనర్చుచు నాయసురుఁడట్లే మృతిజెందె.

నారద—అకటా! దేవనాథా! నీవిట్టి యవివేకివగుదువే. తపమొనర్చుచున్నవారు మృతిజెందుట యెన్నఁడైనవింటివే! పోనీ, మృతిజెందుననియే యందము. ఈపతివ్రతాతిలకము నేలతెచ్చితివి? ఈమెపాతివ్రత్యమెంతని వర్ణింపవచ్చును.

సీ. కురులుమాత్రము దువ్వి కొప్పుపెట్టుటె కాని
తోరంపుఁబూసరుల్ దుఱుముఁబోదు
పాలుపసుపుకుంకుమ బొట్టుపెట్టుటె కాని
మ[illegible]ాదిలకంబుఁ దిద్దఁబోదు
పాటిగా[illegible]మ్మనఁ బసుపుపూయుటె కాని
చందనాదిక్రముల నందఁబోదు
రాత్రికి సేమముఁగోరి వ్రతముసేయుటె కాని
శృంగారవని విహరించఁబోదు

తే॥ గీ॥ కంటె, తాళిబొట్టు, కమ్మలు, కడియంబు
లొక్కవన్నెచీరె లొంటిరెండు
వీడియములేకాని విభవమొల్లదు తన
విభుఁడు రానికతన వెలదియిన్న ॥

ఇంద్ర—ఈమెగర్భమున నాయసురతేజమెన్నినాళ్ళుండియో పెరుగుచున్నది. ఇది [illegible]ట్టి క్రూరాసురుఁడు పుట్టునో యనుభయమున, వానిపుట్టినప్పుడే నఱుకవలయునని



నారద—అయ్యో! అయ్యో! ఇంతన్యాయమా! శిశుసంహరణమునకు నీవెట్లొప్పుకొందువు? నీవొక్కప్పుడు దితిగర్భమునున్న శిశువును సప్తఖండములుగా నొనర్చితివే ఫలమేమైన సమకూరెనా? ఆఖండములు సప్తమారుతములై పోలేదా? ఈశిశుసంహారణ ముద్యమించితివా? అదినీచేనగునా? నీపితామహునికైన సాధ్యమగునా? ఈసతిగర్భమునున్న వాఁడెట్టివాఁడని యెంచితివి?

మ॥ అతినైర్మల్యముగల్గి వైష్ణవకిరీటాలంక్రియాయో[illegible]మై
హతదోషంబున వజ్రభేద్యతరమై యష్టాంగయోగాఢ్యమై
యితరాకల్పితరంధ్రమై సురుచియై యేతన్మహాదైత్యరా
ట్సతిగర్భాఖ్యఖనిం జనించు శిశువజ్రంబద్రిని ర్భేదనా ॥

పురుషోత్తమముసుఁగదా. అదిశుద్ధవజ్రము. మిక్కిలి నిర్మలమైనది. ఇంతైన కళంకము లేనిది. ఉత్తమబ్రాహ్మణజాతికంటె పైదైనది. దోషమున్న నెఱుఁగనిది. అష్టాంగయోగముల నిండినది. ఎవరికిఁగాని రంధ్రమొనరించుటకు సాధ్యముకానిది. ఏవజ్రమునకైనఁ దగనిది. ఇంక మహాభాగవతులగు వైష్ణవశిఖామణుల కిరీటము నలంకరింపఁదగిన వజ్రము. పో! పామ్మరక నీదారిని. ఇంతయజ్ఞానివని నిన్నెఱుఁగ.

ఇంద్ర—మహాత్మా! నీవలన సముచితధర్మము నేఁడువింటిని. నీమాట లేలకల్లలగు? ఈసతీమణి గర్భమునున్న శిశువు విష్ణుభక్తుఁడగునని వచించితివిగాన నాశిశువుపై నాకేమియుఁ గార్పణ్యము గలుగదు.

మ॥ వనితారత్నము వైష్ణవాగ్రణినిగర్భంబందుఁ దాల్చెనం
చును నీవింపుగఁ బల్కఁ బ్రోచితివె యీచోద్యంపువృత్తాంతమున్
విన సంతోషముగల్గె నీతరుణికిన్ విజ్ఞప్తి సేఁ జేసెదన్
ననుమన్నింపఁగ నీమదిన్ గొనకుమా నాసేరమున్ నారదా॥

(లీలావతినిజూచి) సతీతిలకమా! నాయపరాధముల మన్నింపుము. నీమహాత్మ్యము నే నెఱుఁగనైతిని. నీవు వైష్ణవమాతవు కానున్నావఁట. కావున మాకెల్లరకు భజనీయవు. సాకొనతిమ్ము (నారదునితో) ఋషితిలకా! అయిన నాహిరణ్యకశిపుఁడు మృతిఁజెందెననుట కల్లయేయగునా?

నారద—కల్లయా? నేఁడో, రేపో తపస్సాఫల్యమును వరములఁబడసి మీకొంపల[illegible] గానున్నాఁడు.

మ॥ ఇదిగో ఘోరతపఃప్రభావమున వాణీశాను మెప్పించి మీ
పదముల్గైకొననున్నవాఁడు బుధ ప్రత్యర్థిసా[illegible]న్యుఁడై
త్రిదశాధీశ్వర మీఁదెఱుంగక మదోద్రేకంబుతో నేఁడుత
త్సుదతీరత్నము తెచ్చినాఁడవిటులన్ శోకింపనేంతేనియున్॥

ఇంద్ర—నారదా! ఇట్లేల కఠినోక్తులాడెదవు? వాఁడువచ్చెనా యవశ్యము రానిమ్ము. నావజ్రాయుధము రుచి వాడునింత చూడఁగలఁడు (లీలావతితో) పతివ్రతామతల్లికా! లెమ్ము. ఈవిమానము నారోహింపుము. నీయింట నిన్ను విడిచివచ్చెద.

నారద—ఇంద్రా! ఏమియు వలదు. ఈతరుణీమణి నాయాశ్రమముననే యుండఁగలదు.

లీలా—ఋషితిలకామా! కడుపుణ్యముఁ గట్టికొంటివి. నే నీయాశ్రమముననే యుండెద. మనోహరవిధానమున నీవుగ్గడించు ధర్మములనెల్ల గ్రహించెద.

ఇంద్ర—మునీంద్రా! అట్లయిన భాగ్యము. (అని నారదునికి లీలావతికి నమస్కరించి నిష్క్రమించును.)

నారద—అమ్మాయీ! నాయాశ్రమమునెడ కింకఁ బోవుదము రమ్ము. (నిష్క్రమి)

## ప్రథమాఙ్కము-తృతీయరంగము.

### సత్యలోకము.

[ప్రవేశము: బ్రహ్మ-సనకుఁడు-సనందనుఁడు-సనత్కుమారుఁడు-ఋషులు మొదలగువారు.]

బ్రహ్మ—కుమారులారా! వింటిరా శివప్రభావము? ఆమహేశునింబోలిన దైవము వేఱొండుగలుగఁడు. అతఁడు భక్తావనుఁడు. కరుణాగుణభూషణుఁడు. ఆర్తపరిపోషణుఁడు.

సనత్కు—జనకా! కర్ణామృతముగా నీవుగ్గడించిన యుమేశు మహాత్మ్యము మమ్మెంతయు నలరింపఁజేసె.

(లోపల నగ్నిప్రకాశము కనిపించును)

బ్రహ్మ—ఏమిది? ఏదోమంటయున్నట్లున్నది?



[ప్రవేశము: శీఘ్రగమనమున ఒకఋషి.]

ఋషి—విధాతా! సత్యలోకమంతయు నగ్నిచే దగ్ధంబగుచున్నది. ఏమిచిత్రమోకాని నాలుకలు త్రోయుచు మంటలు మండుచున్నది. మాకందఱకుఁ గాక దగులుచున్నది కాని యిండ్లు మేడలు మఁడిపోకున్నవి.

బ్రహ్మ—అదే! నాపీఠమును కాకఁగొనియున్నది.

సనక—అయ్యో! మాకును దగులుకొనియె.

ఋషి—కమలాసనా! ఈ మంట భూలోకమునుండి యింతవరకు నొక్కటేవిధముగ నున్నది.

బ్రహ్మ—అహో! తెలిసెను. నాపై మనసిడి యెన్నియేండ్లనుండియో మహాఘోర తప మొనర్చుచున్న హిరణ్యకశిపుఁడను రాక్షసేంద్రుని తపోగ్ని యిది. [illegible]యరాదు.

ఋషి—విధాతా! వాఁడు క్రూరాసురుఁడే. ఏ వరము లేకయే లోకములనెల్లఁ గాల్చుచుండెను వానికి నీవరములు లభించిన యింకఁదుగవలెనా?

బ్రహ్మ—ఇంకఁదడియరాదు. వాఁడెట్టివరములడిగిన నీఁదగినదే. పోయెద. నా వరముల వలన నిర్భయుఁడై వాఁడు క్రూరకృత్యములొనర్చినా నారాయణుఁడే యున్నవాఁడు.

ఋషులు—(ఎగురులాడుచు) విరించీ! పొమ్ము-పొమ్ము.

(యవనిక దిగజారును.)

## ప్రథమాఙ్కము-తురీయరంగము.

### హిరణ్యకశిపు తపోభూమి

పుట్టలో హిరణ్యకశిపుఁడుండును. తలపైమంట మండుచుండును.

[ప్రవేశము: ఆకాశమార్గమునుండి-హంసారూఢుఁడై-చతుర్ముఖుఁడు]

బ్రహ్మ—చాలింపుము. చాలింపుము. హిరణ్యకశిపూ! నీతపము మెచ్చితి. మెచ్చితి. కోరుము వలయువరములు. అయ్యో! ఇంతశిక్షించి వంటించి ఘోరకీతి తపమొనర్చు వారలుందురే.

మత్తకోకిల. ఓసురారికులేంద్ర నీవలెనుగ్రమైన తపంబుముక్
జేసిచూపినవారు లేరికఁ జేయువారును లేరుగా
నీసమాధికి మెచ్చితి దయ్యా నీయభీష్టములిత్తునా
యాసమేటికిలెమ్ము లెమ్ము మహాత్మకోరుము కోరికల్॥

తొలుదొల్త నీయప్పటిరూపు నీకొసంగెద. లెమ్ము లెమ్ము.

(అని కమండలోదకము పైఁజల్లును).

(హిరణ్యకశిపుఁడు స్వాకారముధరించి లేచి నమస్కరించును).

హిరణ్య—మహాత్మ! నేఁడుగదా సుదినము. నేధన్యుఁడ. నేధన్యుఁడ. (అని నుతించును.

సీ. కమలాసనవిధాత కంజగర్భమహాత్మ
నేనెంతవాఁడను నిను నుతింప
జగములెల్ల సృజించి పొగడుగాంచియొసంగు
లోకేశుఁడవుగదా లోకవంద్య
పురుషుమీఱఁగ స్వయంభువుడవై జన్మించి
విభుతఁజెన్నారిన ప్రభుఁడవీవ
సర్వకారణుఁడవు సత్వరజస్తమో
గుణమయుండవు నీవగురువిలాస

తే. గీ. భక్తజనములపాలికల్పకమవీవ
యాపదుద్ధారకుండ వౌనజుఁడవీవ
నీకుఁజతురాననునకు వాణీధవునకు
నభవునకు నమస్కృతి శతంబాచరింతు॥

బ్రహ్మ—కుమారా! నీ స్తవమునకు నే మెచ్చితి. వలయువరములడుగుము. ఒసంగెద.

హిరణ్య—మహాత్మా! కరుణాసముద్రుఁడవగు నీవు ననురక్షించి వరము లొసంగవచ్చుట నాయభీష్టము నెఱవేఱకపోవునా? రెండు మాటలలో నాకోర్కె విన్నవించెద. నా కమరత్వమును అజేయత్వమును నొసంగుము.

బ్రహ్మ—కుమారా! ఇదిసాధ్యమా. అమరత్వ మొసంగుట కెవ్వరికీ సామర్థ్యముకలదు. ఆసామర్థ్యము నాకేయున్న దేవాసురులు తమసంగ్రామముమానుకొనేల. క్షీరసాగర మథనప్రయత్నమేలని విష్ణువునకు కూర్మావతారముఁ గల్పింపనేల? సముద్రమునకు పుత్ర పుత్రికోదయము గలుగనేల? శంకరుడు గరళకంఠుఁడనిపించుకొననేల. అంత యల్లకల్లోలము కలుగనేల? కావున దానిని మానుము. ఇట్లాడుట నీకీరాదని కాదు. నాను సాధ్యము కాదనియే? వేఱువరము లెవ్వియైన నడుగుము.



హిరణ్య—భాషానాథా! ఆవరములిచ్చుటకు నీకు సాధ్యము లేదన్న నే నేమనగలను? విఫలకీర్తిగా నమరత్వము వలని ఫలమునకు సదృశమైనఫలము గలిగించు వరముల నే నడిగెద. కోపగింపకుము. నాకుపగటివేళనైన, రాత్రినైన, శుష్కాయుధమునైన, అర్ద్రాయుధమునైన, బంచజాతిక ప్రాణులచేనైన, మృగములచేనైన, మృగేతరముల చేనైన, నింటనైన, నింటివెలినైన అరణ్యమునైన, బర్వతమునైన, దరుగుల్మలతాదుల నైన. నరవానరులచేనైన, జగమున నిపుడుపుట్టి వెలయుచున్న యేప్రాణిచేనైన, నేపక్షివితానముచేనైన, ఉరగాదిసరీసృపములచేనైన, పిండజములచేనైన, అండజము లచేనైన, శిలాకంటకాదులచేనైన, నాకు మృతికలుగకుండ వరమిమ్ము.

సీ. పరమేష్ఠి నేకోరు వరములనెల్ల నీ
విచ్చెదనంటివే యొగదయ్యా
నీవుసృజించిన నిఖిల భూతములచే
నస్త్రులచేత గేహంబులోన
బయటను భూమినిఁ బగలింట రాత్రిని
నగసురాసురమృగ నాగముఖ్య
జీవుల చేత నిర్జీవుల చేతను నశియింపకుండ జన్మంబులందు

తే. గీ. నప్రతిద్వంద్వపౌరుష మఖిలలోక
పాలమహిమంబు సర్వాధిపత్యవైభ
వంబు చిరకీర్తి యసమ తేజంబుశక్తి
యింపుమీఱంగనొసఁగి మన్నింపుమయ్యా!

బ్రహ్మ—ఇచ్చితిని. నీతనువమోఘభేద్యము. అజంతుతరుచ్ఛేద్యము. నలోహాద్రి విభేద్యము. నఖరాయుధభేద్యమగుగాక.

(యవనికదిగజారును)



## షష్ఠరంగము - నారదునియాశ్రమము.

[ప్రవేశము : లీలావతి, నారదుఁడు]

నారద — కుమారీ! వింటివా? కర్మబంధమోచనమగు నీయితిహాసము. ఇట్టి ముముక్షువులైన జీవులు తమయభీష్టములఁ బడయుదురు. జ్ఞానులగు వారికి కర్మావరోధము లేదు. అది లేకున్న జగమంతయు విష్ణుమయమనియు, జనులందఱు సహోదరప్రాయులనియు, బుద్ధిఁబొడమును. జ్ఞానచక్షువుల నింతమాత్రము తిలకించిన జగమంతయు తనయందే యిమిడియున్నట్లు శరీరికి దోఁచు. జ్ఞానులకు కులములేదు. జాతిలేదు. ఎవఁడు కాని నిక్కంపు వేదాంత జ్ఞానము బడసిన నతఁడు జగమునందుండు చర్యలన్నియు నిష్ప్రయోజనములని యెఱిఁగి జనులఁజూచి హసించు. జనసామాన్యమున్నవో, జ్ఞానియగు వాని నున్మత్తునివలె భావించు. జ్ఞానమొసంగుటకును, భవబంధనముల దొలగించుటకును, శ్రీమన్నారాయణుఁడే కారణభూతుఁడు. అతనివర్ణయుగళ ధ్యానముగలవానికి లోకమంతయు నశ్వరమనియు ఆత్మమాత్ర మనశ్వరమనియు దోఁచుటయేగాక అప్పరమాత్ముని తేజమున తనయాత్మ తేజము లీనముకాఁగలద్దినమును ప్రత్యహమెదురుచూచుచుండు. కుమారా! వైరాగ్యము కలుగుగాక, భక్తియేయుండుఁగాక, సాధుత్వమే యలవడుఁగాక, జ్ఞానమువలన శరీరికి, గలుగు సుఖము వేఱొండువలన లభింపజాలదు.

(లీలావతి గుఱక వెట్టును).

నారద — ఆహా! ఏమాశ్చర్యమిది? ఈ తరుణి నిద్రించుచున్నది. మైమఱచియున్నది. ఇట్టుండియు నేఁజేయు నుపదేశమును నూఁకొట్టినధ్వని వినుపించుచున్నది. అది యింతవఱకు నేనుగుఱుతింపకుంటి. ఎవ్వరూఁకొట్టుచుందురు? (ప్రకాశముగా) వింటివిగదా జ్ఞానమువలని మహాత్మ్యము.

(లీలావతీ కడుపునుండి వచ్చినట్లు ఊఁ అని ధ్వనివచ్చును).

నారద — (స్వగతము) ఆహా! ఇప్పుడు తెలిసె. ఇదియేమిదైవచిత్రమువలయు? నేఁ జెప్పెడు వేదాంతవిషయమంతయు గర్భముననున్న బాలుఁడూఁ కొట్టుచున్నాఁడు ప్రతిదినమును నిదేరీతి నే యాకర్ణించుచుండెఁగాబోలు. (ప్రకాశము.) భళిరే! ఇది యింతయొప్పునే? ఈబాలుఁడు గర్భవైష్ణవోత్తముఁడు కాఁగలడు. ఇట్టియనవరతము శిశువునకు వేదాంతధర్మ శ్రవణముఁ గావించెద.

[ప్రవేశము : హిరణ్యకశిపుఁడు]

హిరణ్య — (నారదునికినమస్కరించి) నారదా! నీయుపకారము నేనెట్లు మఱువఁగలను, దేవేంద్రుఁడు దోచ్చిన దుడుకుతనమునంతయు నాపట్టణమున నెఱిఁగితి. నీకరుణాపాత్రతను నీయాశ్రమమున మాలీలావతియుండుటయు నెఱిఁగితి నినుదర్శించుకొని కృతజ్ఞత విన్నవించుటకై నేనే—



లీలా — (దిగ్గునలేచి) నాథా! నాథా! ఎట్టినుదినము? (అని పూర్ణాలింగన మొనర్చును)

నారద — (స్వగతము) చిరకాలమెడఁబాసియున్న మోహపూర్ణదంపతుల పరస్పరగానురాగాలాపములకు నాయునికి యనభీప్సితాటంకము. నేఁబోయెద. (అనిపోవఁబోవ)

హిరణ్య — (నిలిపి) ఋషితిలకా! మాలీలావతి యనురాగవశమున మూర్ఛిల్లె. ఈతన్వికిం తుపచారమొనరింపవలయు. (అనిలీలావతిని శయ్యపైఁబరుండఁబెట్టి శిశిరోపచారములఁజేయుచు) నారదా! ఈరమణీమణి కిట్టియాపదవచ్చుటకు దురాత్ముఁడగు నింద్రుఁడుగదా కారణము? వానిపని యింకదెలియఁగలదు. వాడింత కీడొనర్చినవాఁడైనను మాతమ్ముని నిష్కారణముగ వధించిన పాపమొనర్చిన విష్ణువు వానికంటె నాకపరాధమొనర్చినవాఁడగు. వలసినవరములనెల్ల విరించి వలనఁగైకొంటి నిరంకుశాధికారమున జగమునంతయు నాపాదాంగుష్ఠములోనిదిగా నొనర్తు.

ఉ॥ కీడనియెంచకింతతమకించి సతీమణిఁబట్టి తెచ్చియు
న్నాఁడుగదా దురాత్ముఁడగు నాయిఁక వానినుపేక్ష సేయఁజెం
డాడెదనేలరాచి తెగటార్చెదఁదీర్చెదఁనావిరోధముం
జూడుము మౌనిచంద్ర బలసూదనుఁడెంతటిపాటుఁజెందునో॥

మొట్టమొదట వైకుంఠమునకుఁబోయి నారాయణుని కాలనలిపి చంపి తరువాత శచీపతిని మెడఁగళసూత్రముఁ ద్రెంపఁ బ్రయత్నింతు.

లీలా — (నిద్రలో) నాథా! ఇంక నెన్నిదినములు నీతపము? ఏల ననుఁజూడ రావు?

హిరణ్య — నారదా! ఈ కాంతామణి కలవరించుచున్నది. విమానమయ్యెడ నేనిలిపియున్నవాఁడ. వేగరముపోయి పురముఁజేరెద. నీవును విచ్చేసి యాతిథ్యము స్వీకరింపవలయునని ప్రార్థించెద.

నారద — అసురకంఠీరవా! నీవిచ్చు నాతిథ్యములన్నియు నాకువచ్చెను. నాకుఁదపమునంతరాయమభీష్టముకాదు, కావున ననుమన్నింపుము. నీకుఁగలుగఁగల చిన్నకుమారుని ముచ్చటలుచూడ నింకొకసారివచ్చెదనంటలెమ్ము.

(యవనికదిగఁజాఱును).

—( ప్రథమాఙ్కము సమాప్తము )—



శ్రీ

# ప్రహ్లాద నాటకము.

ద్వితీయాఙ్కము - ప్రథమరంగము.

వైకుంఠము.

[(విష్ణువు, లక్ష్మియు, నున్నతాసనములపై,) పీతాంబర శంఖచక్ర కిరీటాధారులై సారూప్యముక్తులు ప్రక్కనఋషులు, సామీప్యముక్తులు].

ముక్తులు—(విష్ణువును స్తుతిచేయుచుందురు)

(వెనుక మహాధ్వని)

ఋషులు—(భయమున) లక్ష్మీరమణా! వైకుంఠమున నిట్టిధ్వని నెన్నడును వినలేదుగదా? ఏమాశ్చర్యమిది?

విష్ణు—ఋషీశ్వరులారా! తెలిసెను. మొన్ననే వరాహరూపమున సంహరించిన హిరణ్యాక్షునకనుజుండు హిరణ్యకశిపుండనువాండు అజుని మెప్పించి పడయరాని వరములం బడసి తనతమ్ముని జంపిన పగందీర్చుటకై నాపైవచ్చుచున్నాండు.

ముక్తుడు—జనార్దనా! వానికెంత కావరమనవలయును? నీచక్రప్రభావము నించుకంతయు సరకుగొనక వచ్చుచున్నవాడుగదా? నాకు సెలవిమ్ము. నేనిప్పుడపోయి వానినుక్కడించి వచ్చెద.

విష్ణు—కుమారా! ఇదిలగ్నకాలము. సమయమును గాదు. బ్రహ్మయొసంగిన వరముల నాలోచింప నింకనుకొన్నినాళ్లువాని మననిచ్చుటయే యుక్తము. వానికిప్పుడు మంచికాలము. మనకుసాధ్యుండుకాడు. కొన్నియేండ్లుకడచినపిదప తానేమరయగలడు. ముక్తులారా! నేనిపుడు వానికంటబడరాదు. పడితినా వాడవశ్యమునను జెనకు. నేసంహరింపవలసి వచ్చు. అదిమదభీష్టమును గాదు.

అనుబంధము 5.

కావున నేసూక్ష్మరూపముధరించి యాదనుజునికి కంటబడకుండనిద్రంగివాని నాసారంధ్రముల నుశ్వాసమార్గమున నడగియుండెద. కాంతామణి! నీవెందుండగలవు.



లక్ష్మి—ప్రాణేశా! నన్నడుగవలయునా? నీకెప్పుడు వానిసంహరింపరాదని మనసు గలిగెనో అప్పుడే వాడధిక పుణ్యాత్ముడయ్యె. నేను. వానివీటనేకొన్నినాళ్ళు వాసముంజేసెద.

[లోపల సమీపమున ఘోరధ్వని]

విష్ణు—ఇంకనుండుట యనుచితము. రమాసతీ! నేనుపోయెదను.

(అనిలక్ష్మితో నిష్క్రమించును)

[ప్రవేశము: హిరణ్యకశిపుండు పరివారముతో].

హిరణ్య—ఏడీ! యాదురాత్ముడు. వానినుక్కడంచెద. ప్రక్కలించెద.

ముక్తులు—అయ్యా! నేవిష్ణువుంగాను. చూడుమా, నాయొద్దలక్ష్మిలేదు? (అనియొకడు శంఖచక్రములందీసివైచును. ఒకడుకిరీటముపారవేయును ఒకడు పీతాంబరము నూడదీయును.)

రాక్షసులు—(ముక్తుల నామములనాకి ఋరునెత్తులపైంగాళ్లుపెట్టి యల్లకల్లోలముం జేయుదురు).

హిరణ్య—రాక్షసోత్తములారా! ఈపందలతో మనకేమిపని! ఆదురాత్ముడు తప్పించుకొనియున్నవాడు. చరాచర ప్రపంచమంతయు వెదకియైన వానిబోనియ్యను. పోదమురండు వానిబట్టియుక్కడింతము.

(నిష్క్రమించును)

---:o:---

ద్వితీయాఙ్కము-ద్వితీయరంగము.

ఇంద్రసభ.

[ప్రవేశము: ఇంద్రాగ్నియమవరుణులు, ఇతర దిక్పాలురు, ఋషులు, అప్సరసలు, రంభ, ఊర్వశి, మేనక మొదలగువారు]

అప్సరసలు—(గానము చేయుదురు).

ఇంద్రుడు—అప్సరలారా! ఈనాడు మీగానముకడురమణీయముగానున్నది. మహోత్సాహమునం బాడితిరి. మిక్కిలి సంతసించితి.

(లోపల కోలాహలధ్వని)

ఇంద్రుండు—ఏమీ యీకలకలము?

[రాక్షససైన్యముతో హిరణ్యకశిపుఁడు]

(దేవసేనవారినడ్డగించును. రాక్షసులు దేవతలఁ బడద్రోయుదురు. ఇంద్రుఁడు. హా హాయని యఱచును. హిరణ్యకశిపుఁడింద్రుని గిరీటముఁగాలదన్ని మెడబట్టి యున్నతాసనముననుండి క్రిందికీడ్చును. అప్సరసలు పరుగెత్తుచున్న హిరణ్యకశిపుఁడు వారి నిలువఁబెట్టును. హిరణ్యకశిపుఁడింద్రుని యాసనముపైఁగూర్చుండును).

శా॥ ఓరీ పాకవిరోధి నాంమణి, గ్రూరోద్యోగినై పట్టితే
వేరాగర్భిణియైన కాంతయెడనా యీభంగి నీచాదయా
దూరాజ్ఞావిహీన యన్యయహరా, దుర్జాత దుశ్శీలనీ
వేరీతిన్ భరియింతువింకఁ జెపుమా యేనిచ్చుశిక్షావిధుల్.

ఓరీ ఇంద్రా! నీకు మూఁడుమార్గములు గలిగించెద. నాకత్యంత విధేయ సేవకుడవైనా చరణములాశ్రయించి యుందువా? కారాగృహమున నుందువా? కాకున్న నీభార్యతో నీపురివెలువడిపోయి యజ్ఞాతవాసుఁడవై యెందేని బడియుందువా? నీభార్యతో యని నేనంటిగదా? అందుననీయదృష్టమంచిదని నమ్ముము. కాకున్న నిరపరాధినిన్ భర్తృదండనలేకుండుట ననదయైయున్న సాధ్వీశిరోమణిని చెఱఁబట్టియీరడివెట్టి నీయట్టిపలువకు భార్యసాంగత్యముఁగలిగింపకయే నీభార్యను చెఱపట్టవలసియుండె. ఐయినను కారుణ్యమున నాకార్యముమానితి. నీవేమందువు?

ఇంద్ర—ఇఁక నేమనగలను? నాభార్యతో వెడలిపోయెద.

హిరణ్యా—అయినఁబొమ్ము. దూషణా! వీనిఁగొనిపొమ్ము. వీనిభార్యను కట్టుగుడ్డలతో వీనివెంటఁబంపి పురముతొలగించిరమ్ము.

దూషణా—చిత్తము. (అని యింద్రునిఁ దోసికొనిపోవును).

హిరణ్యా—దిక్పాలకులారా! కూర్చుండుఁడు. మీకు రెండుమార్గములు గలిగించెద.

అగ్ని—ప్రభువా! మేమునింద్రుడు పోయినట్లే వెడలిపోయెదము.

హిరణ్యా—అదిగాదుసుఁడీ! ఆమార్గము మీకొనరించుటకు నేసమ్మతింపను. మీరుకారాగృహమున నుందురా లేక నేనిప్పుడు నియమింపబోవు దిక్పాలురకు దాసానుదాసులరై యుండి వారును నేనునుఁ బంచినపని సేయుచుందురా?

అగ్ని—మహాప్రభూ! నీయిచ్చకువచ్చినట్లు జరుపుము. కారాగృహమునకు బోమంటి యిప్పుడేపోయెదము. లేక నీకువిధేయులుగా నుండుమంటివా యట్లెయొనర్చెద మింతకంటె మమ్ముఁబురివెడలుమంటివా యింకనుఁగృతజ్ఞులుగానుందుము.



హిరణ్యా—ఇప్పుడామార్గమంగీకరింపను. ఇదే నాభ్రాతృజులు ముగ్గురును నాభాగినేయులేవురున్నారు. వారికి దిక్పాలురపదవుల నొసంగెద. వారిచేతిక్రింద వారుచెప్పినపనులొనర్చుచు మీరుకొన్నినాళ్లుండవలయు. మీరుతృప్తికరముగా మీకార్యముల నెరవేర్చితిరా పిదప మీరు పురమువెడలిపోవ సెలవొసంగెద. మీరుమీకార్యములఁ జక్కఁగ నెఱవేర్పకైతిరా మిమ్ముఁ జెఱసాలనుంచెద. మీరొనర్పవలసిన కార్యములఁ గొన్నివచించెద. మీరు వినియుండవచ్చుఁగదా విష్ణువు నాతోనోడిపోవుట. నాతమ్మునిఁ జంపిన పగదీరవానిఁజెట్టునకు కట్టించి కశాఘాతములనే నానిసంహరింపనెంచియుంటి. వాడుతప్పించుకొనియె. వైకుంఠమునంతయు నాక్రమించి యందున్న వారినెల్ల నాచరణదాసులుగనొనర్చియే తెంచితి. విష్ణుఁడు లేఁడాయెఁగదా. ఇంద్రుడు నిర్నాముడైయెగదా మీరెల్లరు దాసులరైతిరి. ఇంకయజ్ఞాదులొనర్చువారందఱు "నింద్రాయస్వాహా" విష్ణవేస్వాహా" "అగ్నయేస్వాహా" యని యీతీరున నుడువుటకింకేమికార్యము? నేనేయింద్రుడ. నేనేవిష్ణుఁడ. నేనేవిష్ణుశిరచ్ఛేదకుఁడ. నేనేయంతయు. కావున నాహుతులిచ్చువేళ నన్నిచోట్లను "హిరణ్యకశిపువేస్వాహా" యని నేనాజ్ఞయిడియున్నానని మీరందఱికిని నెఱుంగఁజేసి వారట్లాచరించులాగున నొనర్పవలయు. సంకల్పములు చెప్పువేళ "భగవదాజ్ఞయా భగవత్ ప్రీత్యర్థం" యనుమాటల వదలి, "హిరణ్యకశ్యపురాజ్ఞ యాహిరణ్యకశిపు ప్రీత్యర్థం" మని నుడువునట్లొనర్పవలయు. అగ్నీ! నాపోషవర్గమున నున్న జంతుసంతానమునకు శీతబాధలేమియు లేకుండునట్లు నీవుకాచియుండవలయు. యెవ్వడైననొకఁడు నాప్రకృతిజనులలోని వాఁడుశీతబాధచేయించకతుమ్మైనాచాలును. నిన్నీడ్చుకొనిపోయినీళ్ళలోఁద్రొక్కించెద. యమా! నీయధికారము నీకేయుండనిమ్ము. మాకాలనాభుని యాజ్ఞతో నెల్ల కార్యములుఁ జరుపుచుండుము. నావిధేయుల నామిత్రుల నన్నుస్మరించువారల పాపవిమర్శయేమియుఁ జేయక పుణ్యలోకమునందే యుంచుము. నైఋతీ! నీయధికారము స్థైతము నీకేయుంచియున్నాను. అయిన మావజ్రదంతుని యనుమతితో నీకార్యభాగములు నెఱవేర్చుచుండుము. వరుణా! నీవుచేయవలసినపనియిది. నాయాజ్ఞకులోఁబడిన యీలోకముల యందెందుగావి యతివృష్టిదోషముల గలుగనీయ్యక సకాలమున వర్షింపించుచు సంవత్సరమునకు మూఁడుపంటలుగా భూముల నెల్ల గలిగింపుము. ఎందుగాని వానలేదనుమాట పుట్టునట్లొనర్చితివా నీవుంజరముతోడనే నిన్నుద్రొక్కించెద. హెచ్చరిక. సమీరా! నీకార్యమిది. ఏవేళ నాయేలుబడిగల లోకములవారెవరుగాని యేవిధముగ నీవువీచుటను కోరినట్లు నీవు వీవవలయు. కర్షకులు తమభూముల కెరువు దెచ్చుకొనుశ్రమ వారికివ్వగాదు. ఎక్కడనున్న యెరువును నీవు [illegible]

యేభూమియందు యేవేళకెంత కావలయునో యంత్రు వైచుచుండుము. ఇది చేయుటకుఁ దప్పితివా నిను పాములచేఁ గఱపించెద. కుబేరా! ననుఁ జేరినవారి కెవరికెంత ధనము కావలయునో యంతధనమిచ్చుచు రావలయు. నీనవనిధులపట్టినైనను మా నా ప్రకృతి జనులలో నెవ్వరికిగాని దరిద్రుడని పేరుండరాదు. యిట్లాచరించుటకుఁ దప్పితివా నీకింత కుష్టజాడ్యము వచ్చునట్లొనర్చెద. అశ్వినీదేవతలతో నౌషధమిప్పించెద. మఱచితివైరుతీ! నీవుఅశ్వనీదేవతలఁబిలిపించి నాయాజ్ఞ వారికెఱిఁగింపుము. నాలోకమున ననుభజించు నెవ్వరికిగాని యెట్టియామయముగాని రాకుండ వారుత్తరవాదిత్వము వహింపవలయునని వచింపుము. ఎవడుగాని యించుక తలనొప్పివలనైన బాధఁ జెందుట నేవింటినా? వారిమందులన్నియు పొడిచేసి నోటకుక్కిన కంఠ్లనించెదనని సాటింపుము ఈశాన్యా! ఏడీయీశాన్యుఁడు? అప్పుడేపోయెఁగాఁబోలు. పోవనిమ్ము ఆభిక్షుకునితో నేమిపని? అతీంద్రదిక్పాలవరులారా! మీరందఱు దినదినము నొకసారి నాచరణసేవకువచ్చి విద్యమాన విషయములన్నియు నాకువచించుచుండవలయు. ఎవ్వరుగాని విష్ణుస్తుతి యొనర్చునట్లు మీ రెప్పుడైన వింటిరా నాకు జెప్పవలయు. వారినే సంహారణముగావించెద. పొండింక మీకు సెలవిచ్చితి, అప్సరోవతంసములారా! మీ గాన నాట్య చాతుర్యములు దినదినము నాకువలనుపడినవేళ వేచియుండి ప్రదర్శించుచు రావలయు ఇందుకుదప్పిన మిమ్మెల్లర సముద్రమున ముంచునట్లొనర్చెద.

(యవనికపడును).

—✣❖✣—

## ద్వితీయాఙ్కము-తృతీయరంగము.

—✣❋✣—

### క్షీ ర వా రి ధి.

[ప్రవేశము: విష్ణు శేషశాయియై ప్రక్కనలక్ష్మి ఋషులు మఱియొక ప్రక్కనుండి బృహస్పతియు నింద్రుఁడును వచ్చెదరు.]

బృహస్పతి—దేవనాథా! కంటివే యీక్షీరవారాశి. ఎంతకన్నులపండువొనరుచున్నది అంతరంగములనుండి యెంతమనోహరముగ వాయువువిసరుచున్నది. ఈయనుకూల వాయువు మనకార్యసాఫల్యమునకు సూచకముగానున్నది. అదే యయ్యెడనే రమారమణుడు భోగీంద్రశయ్య నలంకరించియున్నాఁడు.



సీ॥ వనధినొంచినయల్లు తనుధరించినపుల్గు
గలుగువాఁడు తనంత వెలుగువాఁడు
కలువఁదట్టినరూపు చిలువమెట్టినయేపుఁ
గన్నవాఁడు విధాతఁ గన్నవాఁడు
గిరినిమోసినసత్తి కరినిఁగాఁచినబత్తిఁ
దనరువాఁడు గిరీశు నెనరువాఁడు
కరువలిమెరసజ్జ మురుపుతామరబొజ్జ
నెసఁగువాఁడు శుభంబు లొసగువాఁడు

తే. గీ. వాలుగలవాఁడల బిల్లువాలువాఁడు
మేలువాఁడిందిరకు జగమేలువాఁడు
జాళువాసాలు వాఁడంఘ్రిజాలువాఁడు
డాలుగలవాఁడు తనమచ్చడాలువాఁడు

(అని యిరువురును విష్ణువునకు నమస్కరింతురు.)

విష్ణువు—దేవగురువూ! దేవనాథా! ఏమివచ్చియున్నారు?

ఇంద్రుఁడు—రమారమణా! సమస్తవిషయములు కరతలామలకముగా తెలియఁగల నీవు "ఏలవచ్చితిరని" మమ్మడిగిన మేమేమివచింపఁగలము? నీపోష్యవర్గముననున్న మాకెట్టి పరిభవము లెట్టిసంకటములు వచ్చినను నీప్రాపున పరాభవముదప్పి యున్నాళ్లమంటిమి. ఇప్పుడు మాకైయున్న హిరణ్యకశిపునివలని పరభవమింతయని వచింపఁజాలము. నేనొంటిగా సతీయుతుడనై యరణ్యవాస మొనర్చుచున్నవాఁడను. నాతోడి దిక్పాలుర దుఃఖమంటివా, దాని పరిమితిఁజెప్పఁజాలను. నాతోనీచరణసన్నిధికి వారెల్లరు రావలయునని యెంతయో కుతూహలముననున్నను వానిదాడికి జడిసి రాఁజాలరైరి. ఎవ్వరైన విష్ణుస్తవమొనర్చినవారి మట్టుబెట్టుటకు తనయొద్దకుఁగొని రావలయునని దిక్పాలుర కారక్కసుఁడాజ్ఞ యిచ్చియున్నాడఁట? ఇట్టివాని నుపేక్షించియుండుట మహాత్మా నీకుధర్మమా? నీవుమమ్ముఁ గాపాడకున్న మేమెవ్వరి శరణొందువారము.

**అనుబంధము 6.**

బృహస్పతి—దేవదేవా! నిర్జరులపైన నీకెల్లప్పుడునున్న కరుణ నేఁడేలకొఱవడియె. నీవింత చేపట్టినవానికిఁ బ్రాభవము కలుగుఁగాక నీవుపేక్షించినవారు నిర్నాములై పోవరా? లెమ్ము. అనుగ్రహింపుము. ఆక్రూరాసురుని సంహరించి యమరులనెల్లఁ బాలింపుము. (అనినమస్కరింతురు).

విష్ణువు—మహేంద్రా! నిర్జరగురువులారా! లెండు. లెండు. మీరింత నను బ్రేరేపింప వలదు. అదుష్టదనుజుఁడొనరించు క్రూరకృత్యములనెల్ల నే నెఱిఁగియే యున్నవాఁడ. ఐన నిది యదనుగాదని యిప్పటి కూరకున్నవాఁడ. అంతయేల ఆదానవుఁడు నీ యెడకు రాకమునుపు నావైకుంఠమునకేతెంచి యదమద మొనరించెను.

అనుబంధము 7.

ఇట్లయినను తాళుకొంటిని. నేనుసమయనిరీక్షణ మొనరించుచున్నాను. ఆచిరకాలముననే వానిసంహారము కాఁగలదు. మీరూఱడిల్లిపొండు. వానికిఁగలిగియున్న కుమారుఁడు ప్రహ్లాదుఁడున్నవాఁడుగదా. వాఁడే యాదైత్యునికి మృత్యువుఁ దెచ్చువాఁడు. యోచింపకుఁడు. పొండు.

ఇంద్ర—"సీ. దండంబు శార్ఙ్గకోదండోగ్రకాండ
ప్రకాండఖండిత దైత్యకాండ నీకు.
బృహ— జోహారుమదగజ ద్రోహహవగ్రాహ
గ్రాహచ్ఛిదావహోత్సాహ నీకు
ఇంద్ర— వందనం బరవింద మందిరాసుందర
తుందరోరస్థలాళింద నీకు
బృహ— జేజేహరాజాది రాజీవపూజా స
మాజోచితాంఘ్రి పంకేజ నీకు
ఇంద్ర— తే. గీ. బహునమస్కారములు చక్రపాణి నీకు
బృహ— నైకసాష్టాంగములు జగన్నాథ నీకు
ఇంద్ర— ప్రణుతిశతములు సురసార్వభౌమ నీకు
బృహ— వంతసేవాంజలులు సదానంద నీకు".

(నిష్క్రి)

—:o:—



## ద్వితీయాఙ్కము-తురీయరంగము,

—:o:—

### హిరణ్యకశిపుని యిల్లు.

[ప్రహ్లాదుఁడు రెండేండ్లవాఁడై తొట్లయందు పండుకొనియుండును ప్రహ్లాదుని నాడించుకొనుచు లీలావతి.]

అనుబంధము 8

లీలా—(బాలునిముద్దాడి తొట్లయందుంచి) X

అనుబంధము 9

(తొట్లంబండబెట్టి నిద్రపుచ్చి నిష్క్రమించును.)

[ప్రవేశము: హిరణ్యకశిపుఁడు]

హిరణ్య—అయ్యా! ప్రహ్లాదా! నిద్రించుచున్నావా? చిన్నపాపఁడ వెంతముద్దులాడవు.
(ముద్దాడును)

ప్రహ్లాద—నారాయణ! నారాయణ!

హిరణ్య—హా! ఏమిది? ఇట్లుకలవరించుచున్నాఁడు? ఈరెండేండ్లబాలునికిఁ బ్రహ్లాదునకు నారాయణశబ్దమెట్లు బట్టువడియె? (లేపి, ఎత్తికొని) కుమారా! ఏమంటివమ్మా?

ప్రహ్లాద—అమ్మా! అమ్మా!

హిరణ్య—అమ్మ వచ్చుచున్నదిలెమ్ము. పిలిచెదను. [illegible]ఏమి భయపడ్డితివా? ఇట్లుకలవరించితివి?

ప్రహ్లాద—ఊఁ!—ఊఁ!

హిరణ్య—ఏమిచూచితివయ్యా? ఎట్లుకనఁబడియె?

ప్రహ్లాద—ఏమిలేదే.

హిరణ్య—అయ్యా! నీవుకలఁగంటివో యిట్లో కాని యేదోయొక దుశ్శబ్దముఁబలికితివి.

ప్రహ్లాద—ఏమంటిని?

హిరణ్య—ఏమోయంటిలెమ్ము. ఇప్పుడేల? కుమారా! ఒక్కమాట. నీవెప్పుడైనకలఁ గాంచి భీతిఁజెందినపుడు నాపేరు "హిరణ్యకశిపు-హిరణ్యకశిపు" యని బల్కుము వేరొక్కరి పేరెత్తకుము.

ప్రహ్లాద—ఊఁ—

హిరణ్య—అయ్యా! నీవెప్పుడైన నారాయణశబ్దము వినియున్నావా? లేక నీకెవ్వరైన చెప్పియున్నారా?

ప్రహ్లాద — నాకెవరు చెప్పలయ్యా. దొంతుపాటలువచ్చును.

హిరణ్య — ఈ రెండేండ్ల యీడుననే పాటలు నేర్చితివా? ఎంతగట్టివాడవు (ముద్దిడుకొని) ఏవీ యాపాటలు?

ప్రహ్లాద —

అనుబాధము 10

హిరణ్య — (స్వ) వీనిచందముగన్న నాకెంత కంటగించుచున్నది. వీనికిట్టిపాట లెవరు చెప్పియుందురు? (ప్ర) కుమారా! మాయన్నా! యిట్టిపాటలింక మఱచిపొమ్ము.

చ॥ తలఁపకుమన్న యాకర్ణశిఁ దప్పకుపాటలు పాడకన్న వే
ష్లుకకుమన్న యాపలువపాపఁపుఁ బేరుల ముద్దుమాటలన్
బలుకకుమన్న నాబలముఁ చేబసి చచ్చిన వైరివర్ణనల్
సలుపకుమన్న దుర్జనుని సన్నుతి నిన్మనసార వేఁడెదన్॥

యివితప్పుడు పాటలు. మరియొక్క పాటపాడుము.

ప్రహ్లాద —

అనుబంధము 11

హిరణ్య — హా!. హా! నేడెం దు[illegible]ని తొక్కు పాటలకు సంతోషించవలయునా దుఃఖింపవలయునా? (ఆలింగనముచేసుకొని) అయ్యా! ఈపాటలింక పాడకుము. ఇంకొకసారి నాయెదుట నసకుము. ఎవరు చెప్పిరయ్యా! యీపాటలునీకు?

ప్రహ్లాద — ఓలులాయ్యా,

హిరణ్య — అయిన నివి నీకెట్లుపట్టువడెను?

ప్రహ్లాద — అమ్మా! అమ్మా! (అనియేడ్చును.)

హిరణ్య — పోదురమ్ము మీయమ్మ యొద్దకు.

(నిష్క్రమము)





## ద్వితీయాఙ్కము-పంచమరంగము.



### హిరణ్యకశిపునగరు.

[లీలావతియొక్కప్రక్కనహిరణ్యకశిపుఁడొకప్రక్కనకూర్చుండియుండి]

హిరణ్య — తరుణీ! ఇదియే నాదుఃఖము.

లీలా — పసిబిడ్డ, వాఁడేమెఱుఁగు? కొంచెముబుద్ధివచ్చిన నుపదేశింపవచ్చును.

హిరణ్య — నాకేమియుఁ దోచకున్నది.

(ఇరువురుపండుకొందురు).

[ ప్రవేశము: 3-4 ఏండ్ల ప్రహ్లాదుఁడు. ].

ప్రహ్లాద — అమ్మా! అమ్మా! నాకుఁ బాలిచ్చెదనంటివే? ఇయ్యవా? నిద్రపోయెదవా!

అనుబంధము 12

హిరణ్య — అయ్యా! ఏమిపాటపాడితివి?

ప్రహ్లాద — ఏమి పాడితిని?

హిరణ్య — ఎమోస్మరణయని యంటివే?

ప్రహ్లాద — ఓహో! అదియుండనీ. ఇదివినుము.

అనుబంధము 13

హిరణ్య — (బాలు నోరుమూసి యెత్తుకొనిపోవును).

—)( ద్వితీయాఙ్కము సమాప్తము.



శ్రీ

# ప్రహ్లాద నాటకము.

## తృతీయాఙ్కము-ప్రథమరంగము.

### హిరణ్యకశిపునగరు. హిరణ్యకశిపుఁడుండును.

హిరణ్య-మూఁడేఁడులబాలుఁడు వీనిచిత్రచరిత్రముఁజూచిన నాకేమియుఁదోఁచకున్నదిగదా. ఎందెందు నిట్టివైపరీత్యముండునే? ఇందుకేమనవలయును? అదురాత్ముఁడగు నారాయణుని స్మరణ మొకనాడుమానఁడు. చిన్నప్పటినుండి యఱువదియేండ్లవఱకు హరిభక్తిలోమునిఁగినవారికైన యిన్ని హరికీర్తనలువచ్చియుండవు. తోడిబాలురతో నాడుకొననైనబోఁడు. కూర్చుండియుండి యేమో తలఁచుకొన్నట్లు కాశము వైపునఁ జూచి "శ్రీహరీ"యని కన్నీరునించును. పడకపైఁబండుకొని ముద్దుమాటలాడుచు నట్టేకన్నుమూసుకొని మాటలాడక మాకు భయముకలిగించు నట్లొకగడియసేపూరకుండి "నారాయణా"యని యుల్లేకించును.

సీ. ఆకసంబుననేమొ యున్నట్టె తాఁ దిలకించు
స్వామిమూర్తి యూరక సంతసించు
మనసార నెవరినో కనినట్లు వచియించు
"శ్రీహరీ"యనుచుఁ గన్నుఁ నీరునించుఁ
బలుమారు హరినామములఁ బాడి నటియించు
నెగరాడి యూఱటనింత కాంచు
మనమాటలొకటియు విననిభంగిఁ జరించు
నలువార నూరక నవ్వునించు

తే. గీ. రాత్రియునుఁ బవలును జాగరమున నుంచు
నెఱఁ బవలురాత్రిఁ గొన్నాళ్ళు నిద్రఁ గాంచు
మేలినిద్రన డాటున మేలు కాంచు
సుకుని మావిరిఁగాంచె నన్నుతము నించు ॥



పలుకులు తొక్కు పలుకులైనను పాటలుమాత్రము ప్రాకృతభాషచేనిండియుండును, ఎవ్వరు వీనికీపాటలఁ జెప్పియుందురు? వానిలోనొక్కటియైన నెందు నెవరునింతకు ముందెక్కడను వినినదికాదు. వీనికివి యెక్కడపట్టువడియుండును? అదిగో వచ్చుచున్నాఁడు.

[ ప్రవేశము: ప్రహ్లాదుఁడు పాడుచు తాళముఁవేసుకొనుచు ]

అనుబంధము 14

హిరణ్య—(అలింగనముచేసుకొని ముద్దాడి) అయ్యా! నీముద్దుపాటలువిన్న మఱియొక సారి విన నపేక్షకలుగుచున్నదికాని వానిలోనియర్థము కడుదుష్టమైనది. ఆమాటనోటనైన నుడువగాదు. ఇట్టిపాటలెక్కడ నేర్చితివి? ఇంకవాని విడిచిపెట్టుము. నామాట. వినుము. నీవట్టిపాటలు పాడుటవలన నాగ్రహము జెంది యెన్నిమాఱులో నిన్నుఁ గొట్టవలయునని యుంకించితిని. కాని నీముద్దుమోము చూచుటవలనను నీజిలిబిలిపలు కులు వినుటవలనను దండింపలేకపోయితి. కుమారా! అదుష్టపు పాటలు చాలింపుము.

ప్రహ్లాద—పాటబాగున్నదయ్యా! స్వామికిఁజ్యోతిచేసి పాడుచున్నాను. ఇదివినుము.

అనుబంధము 15

హిరణ్య—(స్వ) నాగ్రహచారమున కేమనవలయు? ఏల యీచిన్నిపాపనికిట్టిదుర్బుద్ధి వీనికీపాడుపాట లెట్లలవడియుండును? ఇదియెట్లుతప్పించవలయు? (ప్ర) కుమారా! నాచిన్నయన్నా! నాముద్దులయ్యా! నినువేడికొందు. ఈపాటలు వలవ దుడుగుము. మాయన్నవుగా? ఇంకొకసారి యిట్టిపాటలు పాడకుము.

ప్రహ్లాద—ఆపాటవద్దా! ఇంకొకపాటపాడెదను. (అని "జగములో" పాటపాడ నారంభింపఁగా)

హిరణ్య—(చెవులుమూసికొని ప్రహ్లాదునినోరుమూసి) వలదయ్యా! వలదయ్యా!! యీపాటలు దీనియర్థము నీవెఱుఁగవు. ఆపాటలలో చెప్పఁబడినవాఁడు కడుదురాత్ముఁడు. మన కులములో బుట్టినవారెవరును వానిపేరైనఁ దలఁపరాదు.

ప్రహ్లాద—(పైపాట మఱియొక్క చరణముపాడి నవ్వును).

హిరణ్య—ఓరీ సేవకా! (ప్రవేశము: సేవకుఁడు) నీవీక్షణమునఁబోయి యాచార్యుల వారి నిందు దయచేసి రమ్మనుము.

సేవం—చిత్తము.

హిరణ్య—ఇంకచెప్పవుగా ఆపాటలు?

ప్రహ్లాద—అదిపోనీ! వేఱేపాటచెప్పెదను.

[ ప్రవేశము : శుక్రాచార్యుఁడు ]

హిరణ్య—(నమస్కరించును).

శుక్ర—రాక్షసేంద్రా! ఏల నీసేవకుఁడు సంభ్రమమున ననుఁబిలుచుకొనివచ్చె.

హిరణ్య—గురుసత్తమా! నేనిదివఱకు నీతో వచించియుండలేదా యీప్రహ్లాదుని విచారము?

శుక్ర—ఓహో! వీనిహరికీర్తనల విషయమా? ఇప్పుడు వీనికెన్నియేండ్లు?

హిరణ్య—ఇఁక నయిదుదినములకు నాల్గవయేడు పడనున్నది.

శుక్ర—పోనీ! ఇంక నొక్కసంవత్సరమేకదా. తరువాత వానికి సరియైనవిద్య చెప్పించితిమేని యీబుద్ధిజాడ్యము తానే కుదరఁగలదు.

హిరణ్య-ఆచార్యా! అదియట్లుండనిగాక. వీనినోట సాధారణముగా నూరాఱుకీర్తనలు నేవినియున్నాను. అదియెవరు రచియించినదియో తెలియకున్నది! దారుణభంగి నాయాజ్ఞకలిగియుండుటచే నారాష్ట్రములోనివారొక్కరును రచియించియుండరుగదా! ఇంకబాలునికన్నోమాటలువచ్చియు రాని విధానముగనున్నది. పాటలోని సాహిత్యమందమా ధీరరీతిరాజిల్లుచున్నది. ఈచిన్నపాపఁడు వానిరచియించియుండఁడుగదా? ఎటుపయెట్లుపట్టుపడెరాయని నేనడుగ నెందో వినియున్నాననిచెప్పె. వీఁడెక్కడ వినియుండును? కడుచిత్రముగానున్నది. ఆగేయముల రచనావిశేషము నద్భుతముగానున్నది. నూతనఫక్కి విలసిల్లుచున్నది. ఇదిచిత్రచరిత్ర. నీవేమైన నూహింపగలవా?

శుక్ర—ఇదినాకునుఁ విచిత్రముగాఁ దోచుచున్నది. ఇప్పుడేల. వానియిచ్చ చొప్పునఁ బోనిమ్ము. ఐదవయేఁడుకానిమ్ము,

ప్రహ్లాద—("నాకన్నులార్పఁగాను" పాడుకొనుచుపోవును). (నిష్క్ర)

---



తృతీయాఙ్కము-ద్వితీయరంగము.

హిరణ్యకశిపు నగరు.

[నాల్గు సంవత్సరముల ప్రహ్లాదుఁడు పండుకొనియుండును. ప్రక్కన హిరణ్యకశిపుఁడు లీలావతియుందురు.]

లీలా—నాథా! ఇందుకేల యింతయోచింపవలయు? ఏమోపసివాఁడు ఎన్నెట్లో వానికి బుద్ధిపొడమియున్నది. కొంచెము బుద్ధిగలిగినపిదప నాపిచ్చితీఱకుండునా?

హిరణ్య—అదికాదు. నాకుఁగల యాశ్చర్యమేమన్న నెందెందును నేను వినని కీర్తనలు పాడుచున్నాఁడే యనియే నాయాశ్చర్యము? వీనికవియెట్లువచ్చియున్నవి?

లీలా—ఔను. అదినాకునుఁ జిత్రముగానే తోఁచుచున్నది.

ప్రహ్లాద—(నిద్రలో) రమారమణా! ఇప్పుడునాకెంత యానందముగానున్నది..

హిరణ్య—చూచితివే! లీలావతీ! కలయందును కలవరించుచున్నాఁడు. వీనికేమికనుపించుచుండవచ్చును? నేను జయింపఁబోయియుండిన కాలమున కానరాకున్న విష్ణువు మృతిఁజెందియుండి వీనికి భూతమై పట్టియుండునా? వాని జూచినట్లేమాడలాడుచున్నాఁడే.

ప్రహ్లాద—(నిద్రలోనుండి లేచి యట్లే కన్నులుమూసికొని పాటపాడును).

అనుబంధము 16.

హిరణ్య—చూచితే తలోదరీ! వీనికి జాడ్యము మించిపోవుచువచ్చె. అదియట్లుండ నింత మనోహర గీతము వీనికెటులబ్బె?

లీలా—ఈపాట నేనెక్కడనో వినియున్నాను. (జ్ఞాపకముఁజేసుకొనుట నభినయించి) అహా! తెలిసెను. నేనా నారదబుషి యాశ్రమమందుండు కాలమున నామునీంద్రుండీ పాటలోనిపల్లవి యని నట్లును జ్ఞాపకమునకువచ్చె.

హిరణ్య—అది వినికెట్లలవడియుండును. భూతచికిత్సకులరావించి చికిత్సచేయించినఁగాని నాకూఱటగలుగదు.

లీలా—కానిమ్ము. (అనిప్రహ్లాదుని నాలింగనముఁజేసికొని) బాలకా! ఏమిట్లు పిచ్చిపట్టినచందమునఁ జేసెదవు? నీనిద్రయేమి! నీపాటయేమి అయ్యా! నీకెట్లుకనుపించుచున్నది?

అ. వె. అన్నయిందురారర చిన్నపాపఁడరార
నీవిధంబువెలుఁగు నించుమాకు
నిద్రపోవుటేమి నీపాటయేమినీ
కరణియేమి యెట్లుకానిపించు



ప్రహ్లాద—("మానసంబున" అనుపాట ఒకపల్లవియని) ఈపాటపాడితినా?

లీలా—అదికాదు. వేఱొక్కటి.

ప్రహ్లాద—అయిన నీపాటవినుము. ఎంతబాగుగాయున్నదో? (అని మఱియొకపాట పాడును)

అనుబంధము 17

హిరణ్య—ఇదిభూతవిధియే. కుమారా! ఈపాటలన్నిఁటిని మఱచిపొమ్ము.

ప్రహ్లాద—మఱచుటయన్న నేమి?

హిరణ్య—అవిలేవనియు, లేక నీ వెఱుఁగవనియు లేక నీకురావనియు ననుకొనుట.

ప్రహ్లాద—అయ్యా! వున్నవిలేవని యెట్లనుకొందు? వచ్చినవిరావని యెట్లనుకొందు?

హిరణ్య—కుమారా! అవియింక ననుకొనుకుము. అవిపాడితివేని నినుగొట్టెదనుసుమా?

ప్రహ్లాద—(ఏడ్పుట నభినయించి) ఏలకొట్టెదవయ్యా! నేనేమి చేసితిని?

హిరణ్య—(ప్రహ్లాదునాలింగనముచేసుకొని) ఏడ్వకుమా మాయన్నా! ఏడ్వకుము! నీయట్టి బంగారుకొండను నేనుకొట్టుదునా? ఊరక యట్లింటిగాక, నిన్నేమియుకొట్టను. ఇంక కొన్నిమాసములలో నీకైదవయేడు పడఁగలదు. అప్పుడొజ్జలవద్దపంపి నీకుమంచి విద్యఁ జెప్పించెదను. అప్పుడివియన్నియు మఱచిపోఁగలవు. ఏడ్వకుము (అని ముద్దాడును). (నిష్క్ర)

-✣-

తృతీయాఙ్కము-తృతీయరంగము.

పాఠశాల

[ప్రవేశము: బాలురు, ప్రహ్లాదుఁడు చండుఁడు, అమర్కుఁడు]

చండుఁడు—ప్రహ్లాదా? నే చెప్పినట్లేలచెప్పవు? నీతండ్రియే యిప్పుడు జగత్కర్తయు జగత్పాలకుఁడునైయున్నాడు. కావున నతనిని స్మరించియే ముందు విద్యనభ్యసింపవలయు. అనుము. "ఓం హిరణ్యకశిపవేనమః".

ప్రహ్లాద—అయ్యా! అన్నియుఁ దెలిసిన నీవేయిట్లాడిన నెట్లు? నాతండ్రి జగత్కర్తయు జగత్పాలకుఁడునవునా? అతఁడు నాకు కర్తయగుటచే నతనికాళ్ళంటి జోతచేతుఁగాక విద్యకై ముందుముందతని నుతించుట సరియా? "ఓన్నమో నారాయణాయ" యనియే నేస్మరించెద.



చండ—ఆమాటకూయకుము నీతండ్రి నిను జంపివైచును. ముందుపాఠములు కానిమ్ము. (అని పాఠముఁజెప్పును గురువు చెప్పినట్టు పఠించును).

చండ—ఇప్పుడైన ననుము. "ఓం హిరణ్యకశిపవేనమః.

ప్రహ్లాద—"ఓం నమోనారాయణాయనమః".

అమర్క—(ప్రహ్లాదునిఁజంపగొట్టి) దుర్మార్గుఁడా! నీకింత యవిధేయతయా? బాలకులారా! మీకు భోజనమునకు వేళయాయె. మీరెల్లరు వెడలిపొండు. ఓరీ ప్రహ్లాదా! "ఓం హిరణ్యకశిపవేనమః" యని నీవనువఱకు నీవిక్కడనే యుండవలయు. కూడు లేక చావవలయు: ఏమో బాలుడవని కొన్నినాళ్ళుపోవనిచ్చిన నీకింత తలబొగరు గలిగెనా? బాలకులారా! పొండు. (బాలకులు నిష్క్ర)

చండ—ఏమి? మేముచెప్పినమాట చెప్పుదువా లేదా?

ప్రహ్లాద—మీకు మాఱుపలుకనగునా? పాఠముల మీరు చెప్పినదంతయు నేర్చుకొనుచున్నానే.

అమర్క—ఇట్లుండవలయు బుద్ధిమంతుల లక్షణము. అనుము "ఓన్నమోహిరణ్యకశిపవే"

ప్రహ్లాద—"ఓన్నమో నారాయణాయ"—

చండుడు—పలుగాకి! ఇటుగాదునీకుశాస్తి. పడియుండుమిందు. మేము చెప్పినమాట యనుటవఱకు నీకు కూడులేదనుకొనుము. (అని అమర్కునితో నిష్క్ర).

ప్రహ్లాద—అయ్యో! వీరెంత తెలివితేనివారు? మాతండ్రియే దైవమనుచున్నారే! లేకున్న కూడులేక చంపెదమనుచున్నారే! నారాయణ! శ్రీహరీ! నీభక్తి నాకొక్కటికలిగియుండ నాకన్నము వేఱేకావలయునా? చండామర్కుల వంటివారు ననుఁజంపువారలా? వారితెలివి యింతయున్నది. పరమేశా! లక్ష్మీవల్లభా! ఏదీ నాకుఁ గాన్పింపుము. అహో! కనుపించితివా! భళిరేభళిరే (అని గంతులు వేయుచు) దేవా! ఏలమరల మఱుఁగయ్యెదవు? పోకుము. పోకుము. నీపోయిన నాకు దుఃఖముగలుగును (అనిపాటపాడుచుండ).

అనుబంధము 18.

[ప్రవేశము: చండుఁడు అమర్కుఁడు దూరమున.]

చండుఁడు—అమర్కా! చూచితివే యీబాలుని హరిభక్తి యెంతశుభ్రమైనదనవలయు? ఆకలియనినైన ననకున్నాఁడే. రక్షోవల్లభునికట్టికుమారుఁడుపుట్టెను. వీనికి నారాయణస్మరణ విడిపింపుమని శుక్రాచార్యుఁడు నియమించెఁగదా? విడుపించుటట్లుండగా స్మరణముమఱుచు వచ్చెనే?

అమర్క — ఓరిచండా! మనమూరక యీ బాలుని కాకలి గలిగించిన నేమి ప్రయోజనము తుదకు ప్రభువునకు కోపమువచ్చునేమో? వానిస్మరణ వానికేయుండుఁగాక. కూడు లేక చంపిన నేమిప్రయోజనము? ఇంటికిఁ బిలుచుకొని పోదమురమ్ము.

(అని ప్రహ్లాదుని యొద్దకువచ్చి) ప్రహ్లాదా!

ప్రహ్లాద — స్వామీ — వచ్చితిరా! మా శ్రీహరినిఁ జూచితిరా? కనిపించినట్టే కనిపించి నాకు కానరాకఁబోయెనే. అయ్యా! పిలుఁపుడు నాకుఁజూపుడు.

చండుఁడు — కానిమ్ము. మా శ్రీహరి-గోహరి. పోదమురమ్ము. (అనిపిలుచుకొనిపోవుదురు)



## తృతీయాఙ్కము-తురీయరంగము.

### హిరణ్యకశిపు నగరు.

[హిరణ్యకశిపు లీలావతి.]

లీలా — నాథా! నాకు కుమారుఁజూడ బుద్ధిపుట్టుచున్నది. బాదాపున నారునెల లాయెనే వానిఁజూడక, భుజింపఁబెట్టక, తలయంటక, నీళ్లుపోయక, ముద్దాడక.

ఉ. ఆరయనారు నేఁడు నెల లాయెఁగదా మనపట్టివిద్యలన్
నేరువ రొజ్జలొద్దకును నిచ్చలపున్మదిపోయెనొంటిగా
నేరహినిల్చునో చదువులెట్లు గ్రహించెనో మీనకేతుని
గేరెడు నాకుమారుఁ దిలకింపఁగ నాకుమనంబు గగ్గెడిన్.

హిరణ్య — కామినీ! నాకునునట్లే చూడ బుద్ధకలుగుచున్నది. వాని చూడకుండుటను నాకేమిపగయా? ఇంటికివచ్చుచుండ వానికి భయముకలుగదనియు, వానికిఁ బట్టువడినదుర్మతము మానదనియు, నూహించి గురుకులవాసమే యొనర్చి భోజన మజ్జనాదులకునయిత మందెయుండిన మేలుకలుగఁగలదని కదా వానిని శుక్రకుమారుల కప్పగించి యిన్ని నాళ్ళుంటి? సేవకా! నీవీక్షణమునఁబోయి చండామార్కులను, నాకుమారునిఁ బిలుచుకొనిరమ్మని చెప్పుము.

సేవక — చిత్తము. (నిష్క్రమి)



హిరణ్య — ఆఱుమాసములకుముందే చక్కఁగ విద్య నేర్పియుండెడి. ఇప్పుడక్కడనే యుండి యుండున నింకను విద్యాధికుఁడైయుండును. ఆపేర పిలువరాని పలుగాకిని మాత్రము స్మరింపకయుండెనా యెంతయో విద్వాంసుఁడనిపించుకొనుచుండెడి. అదె యందెల చప్పుడు వినిపించుచున్నది. వచ్చుచున్నాఁడు కాఁబోలు.

[ప్రవేశము: చండామార్కులు ప్రహ్లాదునితో ప్రక్కన] X

చండుఁడు —

ఉ. "త్రిప్పకుమన్న మామతము దీర్ఘములైన త్రివర్గపాఠముల్
దప్పకుమన్న నేఁడు మన దైత్యవరేంద్రుని మ్రోలమేము ము
న్జెప్పినపాఠముల్వదలి చెప్పకుమన్న విరోధిశాస్త్రముల్
విప్పకుమన్న దుష్టమగు విష్ణుచరిత్రకథార్థజాలముల్".

అయ్యా! ప్రహ్లాదా! నిన్ను వేడుకొందుము. మేము చెప్పినపాఠములన్నియుఁ జక్కగ వదింపుము. అడిగినమాటకుత్తరమిమ్ము. ఆవిష్ణుని ప్రస్తావనమాత్రము నీతండ్రియెదుట నెత్తకుండ మమ్మనుగ్రహింపుమా!

హిరణ్య — (ప్రహ్లాదుని సమీపించి యాలింగనముఁ జేసికొని పీఠముపైకిఁబోవును).

లీలా — (ప్రహ్లాదుని కౌఁగిలించి ముద్దాడును).

హిరణ్య — (ప్రహ్లాదుని తనతొడపైఁ గూర్చుండఁబెట్టుకొని).

శా. చోద్యంబయ్యెడి నింతకాలమరిగెన్ శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువులేజాడన్ పఠింపించిరో
విద్యాసారమెఱుంగఁగోరెద భవద్విజ్ఞాతశాస్త్రంబులోఁ
బద్యంబొక్కటిసెప్పి సార్థముగఁదాత్పర్యంబు భాషింపుమా.

ప్రహ్లాద —

కం. చదివించిరి ననుగురువులు
చదివితి ధర్మార్థముఖర శాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁ జదివితిదండ్రీ

కం. కడవెడు పెరుగుఁజిలికి బ
ట్టెడు వెన్నన్ వెలికిదీయు కేవిధినేనె
క్కడు వేద శాస్త్రములలోఁ
బడసితి సారంబు దనుజపాలకచంద్రా.

హిరణ్య—అయ్యా! చదువులలోని మర్మముఁ దెలిసితివా? నాకెంత సంతోషము. నీతోడి బాలురెల్ల మహానీతి విదులైయున్నారని విని నీకొరకై యెంతో యెదురు చూచుచుంటి.

శా. నిన్నుం గెచ్చరునీతిపారగరిమన్ నీతోడిదైత్యార్భకుల్
కన్నారన్నియుఁ జెప్ప నేర్తురుగదా గ్రంథార్థముల్ దక్షులై
అన్నా యెన్నఁడు నీవునీతిమతి వౌదంచుం గ మహావాంఛతో
నున్నాడన్ననుఁ గన్నతండ్రి భవదీయోత్కర్షముం జూపవే.

కుమారా! శాస్త్రములలో సారముఁ బడసితివంటివే? ఏది నీసారముని

ప్రహ్లాద—

కం. శారీరకాంతి విజిత మసారము
భక్తావనైకచాతుర్య దయా
సారమఖిలభీకరభుజసారము
హరితత్వమొకటె సారము తండ్రీ.

హిరణ్య—(ఆశ్చర్యమునభినయించి) అయ్యా! కుమారకా ఇదియేమి చదువు? ఏమి సారము! ఆ దురాత్ముఁడగు హరిని యేల స్మరించెదవు?

శా. నాకుం జూడఁగఁ జోద్యమయ్యెడిఁగదా నాతండ్రి యీబుద్ధి తా
నీకుంజ్లోపలఁ దోచెనో పరులు మూర్ఖతుల్ పఠింపించిరో
యేకాంతంబున భార్గవుల్ పలికిరో యీదానవశ్రేణికిన్
వైకుంఠుం డుగ్రతాపరాఘుఁ డతనిన్ వర్ణింప నీకేటికిన్

ప్రహ్లాద—అయ్యా! అదియంతయు దైవాయత్తము. మాధవ మను పాదచరణములపై భక్తిమై నెలకొనియున్న మానసము దేవాంతర ప్రసక్తికిఁ బూనునే?

సీ. మందారమకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు పోవునే మదనములకు
నిర్మలమందాకినీ వీచికలదూఁగు
రాయంచ చనునె తరంగిణులకు



లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరకం
బరుగునే సాంద్రనీహారములకు

తే. గీ. నంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృత పానవిశేషమత్త
చిత్తమేరీతి నితరులఁ జేరనేర్చు
వినుతసద్గుణశీల, యోదనుజపాల.

హిరణ్య—శుక్రకుమారులారా! ఇదియా మీరు చెప్పినచదువు?

చ. పటుతరనీతిశాస్త్రచయపారగుఁ జేసెదనంచు బాలుఁ నీ
వటుగొనిపోయి వానికి ననర్హములైన విరోధిశాస్త్రముల్
గుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండవటంచు నమ్మితిన్
గటకట బ్రాహ్మణాకృతివి గాక యథార్థపు బ్రాహ్మణుండవే

చండుఁడు—(చేతుల జోడించి).

ఉ. తప్పులు లేవు మావలన దానవనాథ విరోధిశాస్త్రముల్
జెప్పము కూరులై పరులు జెప్పరు నీచరణంబులాన సు
మ్మెప్పుడు నీకుమారునకు నింతయు నైజమనీష యెవ్వరున్
జెప్పెడిపాటిగాదు ప్రతిచింతఁ దలంపుము మాటలేటికిన్

అమ—కం. మాత్రలము పురోహితులము
పాత్రులమే మదియుఁ గాక భార్గవులమునీ
పుత్రునికట్టివలెఁ జెప్పఁగ
శత్రులమే మేము దైత్యచంద్రా నీకున్.

ప్రహ్లాద—అయ్యా! వారినేల కోపగించెదు? పూర్వజన్మసుకృత పరిపాకము లేక హరిపూజా పుణ్యము లభించునా? అది యొకరుచెప్పిన వచ్చునా?

ఉ. అచ్చపుఁజీకటింబడి గృహవ్రతులై విషయప్రమత్తులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణులైనవారికిన్
జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైననే
మిచ్చిననైనఁగానలకు నేగిననైన హరిప్రబోధముల్

హిరణ్య—దుర్మార్గా! నీవిఁకొకసారి హరిపేరెత్తిన నినుఁజించివైచెద.

ప్రహ్లాద—తండ్రీ! ఆపేరెత్తవలయునన్న నాయత్నమా? ఎత్తకుండుటకు నాకుసాధ్యమా?

తే. గీ. అయ్యవినవయ్య నాహృదయంబునందె
కాదునీయందు సకలలోకములయందు
నుండివిష్ణుండె యాయాప్రయోజనములఁ
దానెకావించునొకఁడె స్వతంత్రుడగుచు.

హిరణ్య—కులనాశకా! నీకింతకావరమా? (అని కత్తినెత్తి ప్రహ్లాదుని గొట్టబోవ).

అనుబంధము 19.

లీలా—(చేతులుపట్టుకొని) నాథా! నీవు కోపగించుట కీబాలుఁ డెంతటివాఁడు? పిచ్చుకపై బ్రహ్మాస్త్రమన్న విధానమగుగదా?

చండ—మహాప్రభువా! క్రోధముజ్జగింపుము.

కం. "నీపాపనిఁ జదివింతుము
నీపాదములాననింక నిపుణతతోడన్
గోపింతుము దండింతుము
కోపింపకుమయ్య దనుజకుంజరపట్టిన్

హిరణ్య—ఇంకచాలింపుడు. మీచదువులింకేమియు వలదు వెడలిపొండు.

చండ<br>అమర్క } చిత్తము. (నిష్క్ర—9)

హిరణ్య—బాలకా! నీవీదుష్టమతము మానదువా లేదా?

సీ. "అస్మదీయంబగునా దేశమునఁగాని
మిక్కిలిరవిమింట మెఱయవెఱచు
నన్నికాలములందు ననుకూలుఁడైకాని
విచ్చలవిడిగాలివీవవెఱచు



మత్ప్రతాపానలమందీ కృతార్చియై
విద్వేషమున నగ్నివెలుఁగవెఱచు
నతితీక్ష్ణమైన నాయాజ్ఞనుల్లఘించి
శమనుండుప్రాణులఁ జంపవెఱచు
తే. గీ. నింద్రుఁడౌదల నామ్రోలనెత్తవెఱచు
నమరకిన్నర గంధర్వయక్షవిహగ
నాగవిద్యాధరావలి నాకువెఱచు
నేలవెఱవవు పలువ నీకెవరుదిక్కు".

హిరణ్య—ఎవఁడున్నాఁడురా నీకుదిక్కు?

ప్రహ్లాద—అయ్యా! నీవిట్లడుగ నేనేమని వచింతు?

తే. గీ. దిక్కెవ్వఁడు దుర్బలురకు
దిక్కెవ్వఁడునీకునాకుఁ ద్రిదిశాదులకున్
దిక్కెవ్వఁడు భూజనులకు
దిక్కెవ్వఁడు అతఁడుహరియే దిక్కగుతండ్రీ.

హిరణ్య—ఇంతయ్యు నీదుష్టమతము మానవా? తరుణీ! యింక నేను సహింపజాలను. కొడుకగుఁగాక, ఎవ్వఁడైన నగునేగాక నావిరోధిపక్ష మవలంబించువాని మన నివ్వను. ఒక గడియ వీనికవకాశమిచ్చితి. కొడుకే నీకుఁగావలయునన్నఁ జక్కఁగ నుపదేశ మొనర్చి దుష్టమార్గమునుండి త్రిప్పుము.

అనుబంధము 20.

బ్రతికియే. యుండవలయునని వీడిఁచ్చయించునేని వీఁడును దుర్బుద్ధివీడువాఁడు. నేఁనిదె మరలివచ్చెద. (నిష్క్ర—9.)

లీలా—అనుఁగుపట్టి! చూచితివా నీజనకుడెంత కనలియున్నాఁడు? ఏల యాతనికిఁ గ్రోధము జనించుభంగినాచరించెదవు? జనకాజ్ఞ యవశ్యము పాలింపఁదగినదికదా? కుమారా! తండ్రిని తిరస్కరించుట పాడిగాదు. అతఁడు దుష్టమార్గమన్నదానిని నీవేలవిడువరాదు!

ప్రహ్లాద—అమ్మా! లోకరక్షకుని జగదీశుని రమావల్లభుని స్తుతియొనర్చుట దుష్టకార్యమా!

లీలా—అయ్యా! దుష్టకార్యముకాదనియే యనుకొనుము. తండ్రికొఱకై నదిమాన వచ్చుగదా?

ప్రహ్లాద—సత్యమే? నాయట్టిబాలుని మనసునకు సయితము తరుణోపాయము గలిగించు సత్కార్యము దుష్కార్యమన్నఁ దండ్రియైన నేమి, అది వినవచ్చునా? ఇందున పిత్రాజ్ఞోల్లంఘన పాపము గలుగునా?

లీలా—అన్నా! పోనిమ్ము! నీవు సత్కార్యమేయని యంటివిగదా? దాని విడువకున్న మానె నీమనసున నీవు నుతించుకొనుము. వెలికిఁ జెప్పి తండ్రిమనసునకేల యసంతృప్తి గలిగింపవలయు?

ప్రహ్లాద—అమ్మా! నాకేమిభయము? ఆశ్రీవల్లభుని పాదసేవ మనోవాక్కర్మములనే నొనర్పనుండ మనసునఁదాచనేల?

లీలా—అయ్యో! కుమారా! నీతండ్రి నినుశిక్షింతు సంహరింతునని చెప్పలేదా? అట్టి క్రోధమునకేల యవకాశమీవలయు?

ప్రహ్లాద—అమ్మరో! నీవాడునది భ్రాంతిగదా! ఈలోకమున ఒకరినొకరు శిక్షించువారున్నారా? అన్ని శిక్షలకు మాధవుడేకదాకర్త? అతని యాజ్ఞలేక నొకరి నొకరు శిక్షించువారలా?

లీలా—పుత్రా! నీకేమి గుణము పట్టువడియె? ఈయీశునకే నీకుఁగల దైవభక్తి సంతసింపవలయుటమాని, దానికి గాఁగల ఫలమునకై దుఃఖింపవలసి వచ్చెగదా? [illegible]యన్నా! విడువుమీమతము.

అనుబంధము 21.

నీజనకుఁడు జగమునంతయు గెలిచి స్వాధీనమందుంచుకొని జగతీశుఁడును జగదీశుఁడును నతఁడేయై యున్నాఁడు. అతని యెదుట ప్రత్యుత్తరమిచ్చి యొకఁడు బ్రతుకఁగలఁడా? ఆతని కొకరడ్డము రాఁగలవారలా? పట్టీ! నామాటవినుము. ఎవరికో అక్కరగాకున్న, నిన్నొక రంగుళమునఁ జెనకుటఁజూడఁజాలని నాకొఱకైన నీపట్టుమానుము.

ప్రహ్లాద—తల్లీ! ఈమాటనకుము. బ్రదుకుఁదెరువుపదేశింపఁగలనీవు నాకిట్లుపదేశము సేయఁజనునే? నీవేమైన నొనర్పమనుము, శిరసావహించి యొనర్చెద. హరిభజన మానుటమాత్రము నాచేతఁగానిపని. నీకునమస్కరింతు. నను మన్నింపుము.

(అని కాళ్ళఁబడును)

[పునః ప్రవేశము: హిరణ్యకశిపుఁడు.]

హిరణ్య—ప్రియా! ఈకుమారుఁడు తనదుర్బుద్ధి వదలినట్లున్నదే? నిను మన్నింపఁగోరి నట్లున్నదే? ఇప్పుడు సంతసించితిని. (ప్రహ్లాదునెత్తుకొని ముద్దాడి) కుమారా! నీవు మాయన్నవుగా? నిన్నెంతెంతో శిక్షింపవలయునని యెంచియుంటినే? నీయసువుల హరింపఁదలఁచి యుంటినే? కుమారా! ఇంకఁ జేయువుగా హరిభజనము?



ప్రహ్లాద—అయ్యో! ఆభజన మానుట నాకుసాధ్యమా? నాశరీరముతోడ బుట్టినదికదా నాకా విష్ణుభక్తి? నీవుగొప్పవాఁడవు. జగమునంతయు స్వాధీనమందుంచుకొన్న వాఁడవు. నాకుతండ్రివి. పూజనీయుఁడవు. నీమాట జవదాటక నేజరుపఁగోరుదు వేని హరిభజనము మాత్రము మానమనకుము.

హిరణ్య—ఓరీదురాత్మా? ఐన నీదుర్బుద్ధిమానవా! చూడుము. మగల నేఁదిప్పువాఁడను గాను. కొడుకని చూచువాఁడనుగాను. చంపింతునంటినా చంపింపకఁ దప్పను. ఇంకాభజన మనోవాక్కాయములమానితివని నాచరణము లంటుము. కాకున్న నీవు చచ్చితి వనుకొనుము.

ప్రహ్లాద—అయ్యో! ననుఁజంపించితివా మేలాయె. అందుకెట్లయిన నోర్చుకొందుగాక, రమావల్లభు భజనమాత్రము నీవేమన్నను మానను. ఆకంజాక్షునకు నమస్కరింపనిశరీర మొక్కశరీరమా? గాలినించిన తోలుతిత్తియగుఁగదా! ఆవనజలోచను నుతింపని నోరొక్కనోరా? ఇంతవాయించిన డమడమ వాగువాద్యముగదా? ఆశ్రీహరిని పూజించని చేతులొక్కచేతులా? కట్టెగటెలుకదా! రమారమణుని చూడని కన్నులు కన్నులనవలయునా? దేహమను గోడయందుంచిన బెరుగండ్లనవలయుగాక.

సీ. "కంజాక్షునకుఁగాని కాయంబు కాయమే
పవనగుంభితచర్మభస్త్రిగాక
వైకుంఠుఁబొగడని వదనంబువదనమే
ఢమఢమధ్వనితోడిఢక్కగాక
హరిపూజనములేని హస్తంబుహస్తమే
తరుశాఖనిర్మిత దర్విగాక
కమలేశుఁజూడని కన్నులుకన్నులే
తనుకుడ్యజాలరంధ్రములుగాక
తే. గీ. చక్రిచింతలేని జన్మంబుజన్మమే
తరళసలిల బుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగముతోడి పశువుగాక ॥

హిరణ్య—దురాత్మా! మాయుమింకనోరు. ఇంతకావరమా? నాకెదురుగ మాటలాడెదవా. అయిన నీవాపాపాత్ముని స్తోత్రముచేయుటమానవు [illegible] వచించెద. వదలవా? వదలవా? వదలవా?

## అనుబంధము 22.

నిను విక్రమముగా సంహరింతు. నాయానసంవరింతు.

ప్రహ్లాద—అయ్యో! ఏలయీమాటలు? లోకములనెల్ల పుట్టింపఁ, బెంప, సంహరింప నైపుణ్యుఁడొక్కఁడు కర్తగాక నేనుసంహరించెదనని యొకరు చెప్పుటకుసాధ్యమా? చావురావలసినవేళ నెవరడ్డము వచ్చినను వచ్చును. రాఁగూడనివేళ నెందఱు సంహరింప నెంచినను రాదు.

హిరణ్య—అగుము. కాఁగకుము. చెప్పు మొక కడమాట?

ప్రహ్లాద—ఇదియే నాకడమాట. త్రికాలములయందునుఁ ద్రికరణములందును విష్ణుచింతనమే నాతరుణోపాయము.

హిరణ్య—కానిమ్ము, దురాత్మా! ఓరీసేవకా!

[ప్రవేశము: సేవకుఁడు]

నీవీక్షణమున యీపాపాత్ముని గొనిపోయి కాలనాభాదిరాక్షసుల కొప్పగింపుము. వారితో నాయాజ్ఞవచింపుము. ఆపశ్చిమభాగమున దూరముననున్న యున్నతశైలము నకు వీని గొనిపోయి శిఖరముననుండి క్రిందికిఁ బడునటుల దొరలింప నాజ్ఞయిచ్చితినని చెప్పుము. నానందనుఁడనియు, సుకుమారుఁడనియు దలంపకుము.

(అని ప్రహ్లాదునిఁ ద్రోయును).

సేవకు—(ప్రహ్లాదుని నీడ్చుకొని నిష్క్రమించి).

లీలా—హా! నాథా! (అని చరణములపైఁబడును).

హిరణ్య—భామామణీ! ఇంక నాశక్తి మీఱినది. అట్టిదుష్పుత్రుఁడుండుటకంటె లేకుండుటే మేలు లెమ్ము లెమ్ము. (అని లేవనెత్తుచుండ).

(యవనిక దిగజారును.)

—॥ తృతీయాఙ్కము సమాప్తము ॥—



॥ శ్రీ ॥

# ప్రహ్లాద నాటకము

## చతుర్థాఙ్కము-ప్రథమరంగము.

### పర్వత భూమి.

[ప్ర: కాలనాభుఁడు, వజ్రదండుఁడు. ప్రహ్లాదునితోఁ బర్వతశిఖరమున]

కాలనాభ—ఓరీ! పితృద్రోహీ, ఇదే మాయాజ్ఞయైయున్నది ఎఱుఁగుదువుగదా? ఇప్పుడైనను నీవాదుష్టచింత మానెదవనిన మాటయిచ్చితివా జగదీశునొద్దకుఁ బోయి మేము మన్నింపవేఁడుకొందుము. ఏమందువు?

## అనుబంధము 23.

ప్రహ్లాద—నేనేమందును. కృష్ణాయందును. నారాయణాయందును. కానిండు. మీయాజ్ఞ నిర్వహింపుఁడు.

కాల—(వజ్రదండునితో ఏకాంతముగ) ఓరీ! వీనికి నిద్రవేళవచ్చినది. నిద్రపోయినప్పుడు పిరుపాత మొనర్చిపోదము.

వజ్ర—అవును. అదియే మేలు.

ప్రహ్లాద—(పాటపాడుచుఁ బండుకొనును).

## అనుబంధము 24.

కాల—వజ్రదండా! నిద్రపోయినట్లున్నది. ఇంకమనపనిఁ జేయుదమా!

వజ్ర—(ప్రహ్లాదునిజూచి) కాలనాభా! ఇంకను నిద్రపట్టినట్టులేదు. కొంచెముతాళుదము. (ఇరువురుకొంచెముసేపు నిలిచి ప్రహ్లాదునెత్తియట్టె క్రిందవేయుదురు. శబ్దముతో ప్రహ్లాదుఁడు క్రిందబడును. ఒక ఘటికాలమున తెరక్రిందికివడి లేచును).

ప్రహ్లాద—(పాటపాడుచు ముందటికి వచ్చును).

[ప్రవేశము: నారదుఁడు].

## అనుబంధము 25.

నారద—భళీ! కుమారా! నీవు కడుధన్యుఁడవు, ఆవిష్ణునను గ్రహము నీకు పరిపూర్ణముగాఁగలదు. ఉన్నతశైల శిఖరమునుండి పాతమొనర్చియు నించుకైన కందకుండ యున్నాఁడవే?

ప్రహ్లాద—మహాత్మా! నమస్కరించెద. నీవెవ్వరవో నెఱుగను. ఐన నీవీణాగానము వినగా, నీవును హరిభక్తశిఖామణివని తెలియవచ్చెఁగాని నీధ్వనిమాత్ర మెందో కలలో విన్నట్లున్నది.

నారద—కుమారా! నేనారదుఁడను.

ప్రహ్లాద—ఆహా! నీవా నారదుఁడవు? (నమస్కరించి) సాధారణముగా మానవులకంటికగోచరుఁడవైన నిన్నుఁగనుగొను మహాపుణ్యమెవరికి లభింపఁగలదు? మహాత్మా! నను ధన్యుఁజేయఁగదా నీవిందేతెంచుట.

నారద—కుమారా! నిన్నుఁగాంచుటచే నాకును ధన్యతసిద్ధించె. హరిభక్తులగు మము బోఁట్లెల్లనీకు వెలుగుఁబట్టుటకైన నర్హులముకాఁజాలము. ఇదియంతయు నీపూర్వజన్మసుకృతఫలము. ఎవరుమాన్పినను నీకా రమేశునిమీఁద భక్తిమానఁజాలదు. దృఢభావమున నీవతనిని నమ్మితివా యేకీడునురాదు.

సీ. ఓ బాలహరిభక్త యోగి నిన్నుఁజూడనా
స్వాంతంబునను నిండెసంతసంబు
బరికింపఁగాఁబూర్వ భవపుణ్యఫలమున
గాకింతఘనభక్తి గలుగఁగలదె
యీయీడునకెయున్న యీభక్తి యెవరెం
తమాన్పఁబూనినవైన మానగలదె
వైష్ణవాగ్రణులలో వరమణివైయీడు లే
కున్నవాఁడవేమో కుమార

తే. గీ. వసుధ ననుఁబోలు భక్తులెవ్వరుగాని
తెలియ నీప్రాభవమునకు దివియపట్టఁ
జాలువారెను యెన్నిచందాలనైన
వేదహితపాదలోల ప్రహ్లాదబాల ॥

నినుఁజూచుటకే నేవచ్చితి. ఇఁక నేఁబోయివచ్చెద.

ప్రహ్లాద—మునికులతిలకా! ఎంతప్రాణముపైవచ్చినను హరిభజనము మాననిపుణ్యము నాకుఁగలదుగదా?

నారద—(ప్రహ్లాదునాలింగనముఁజేసి) బాలభక్తాగ్రేసరా! నీవేమియు యోచింపకుము. [illegible] భక్తి [illegible]కినితప్పదు. ఎవరెంత కీడొనర్చినను నిన్నేమియు బాధింపఁజాలదు.

(యవనికపడును)



## చతుర్థాఙ్కము-ద్వితీయరంగము.

### హిరణ్యకశిపునగరు.

[లీలావతి మూర్ఛిల్లియుండును ప్రక్కన హిరణ్యకశిపుఁడు].

హిరణ్య—తరుణీమణీ! ఏమిచింతించి యేమిప్రయోజనము? ఇది యత్నములేనిపని. ఊరక శోకము మానుము.

లీలా—నాథా! బాలుఁడనియైన నించుకంతయు కరుణింపకఁబోయితివే? ఎట్టిదుర్మార్గతమలవడినను సుతుని శిక్షింపవలయుఁ జక్కనిమార్గమునకుఁ దేవలయుఁగాక, చంపఁబంపుదురే? అయ్యో! ఈ వఱకు నాకుమారుఁడేమైయున్నాఁడో? వాని వియోగదుఃఖము భరియించి నేమనఁగలనా?

సీ. రక్కసుల్బడఁద్రోయ రక్షింపరావె
మాతల్లియనుచు నన్నుఁదలచెనేమొ
పైనుండిపడఁబోవువడి దిక్కుతోఁపక
యమ్మా యనుచుఁజాల నఱచెనేమొ
మిగులనేరములేక తెగటార్చెఁదండ్రి
బల్కాకిరుండనుచు నాడికొనియెనేమొ
తండ్రిచంపఁగబంపఁ దానడ్డపడదయ్యెఁ
దల్లియంచని తల్లడిల్లెనేమొ

తే. గీ. యెట్లులున్నవాఁడొ యేమయినాఁడొనా
కకటవానిముద్దు మొగముఁజూచు
భాగ్యమింకలేదొ పాపినేనెందు
వెదకుదాననెట్లు బ్రతుకుదాన.

ప్రాణేశా! మన్నింపుము. నీసుతునిఁ బిలిపింపుము. నీకులాభరణమును.

హిరణ్య—తన్వీ! ఇదియేమిభ్రాంతినీకు? వాఁడొకకొడుకని నీవు భావించెదవా? నందనవనమున విషవృక్షము పుట్టినట్లు బుట్టినాఁడే? యింత[illegible] నాకీర్తియంతయు పాలివోవదా?

[ప్రవేశము: కాలనాభుఁడు]

కాల—దేవా! మీయాజ్ఞ తెలంగున మీకొమారుని శైలశిఖరముపైకి గొనిపోయి యచ్చటనుండి యావైపునున్న యగాధబిలమునఁ ద్రోసివచ్చితిమి.

హిరణ్య / లీలా } హా! కుమారా! (యనిమూర్ఛిల్లుదురు).

అనుబంధము 26.

లీలా—అయ్యో! పుత్రా! ఈ యేడేండ్లుమాత్రము పెంచుటయే నాకుఫలమా? నీ కాపాడు హరిభజన మెట్లలవడియె? నీజనకునికి నీవేల శాత్రవుఁడవైతివి? అయ్యో! తనయా! అంతయెత్తునుండి నీవగాధకూపమునఁబడునప్పు డమ్మాయని నన్నెంత తలఁచితివో? ఎట్లుభరించితివో. అయ్యయ్యో! నేనెట్లుసహింతును? నాథా! నీ కించుకైన కరుణలేదయ్యెనే? కన్నకుమారు వధింపఁబాల్పడితివే?

హిరణ్య—హా! కుమారా! నినుబాసి నేనెట్లుజీవింతు? ననుతిరస్కరించుబుద్ధి నీకేల కలిగె. ఏలయమురాత్ముని స్మరించుట మానవైతివి. నీపాటల యర్థమునకుఁ గంటగించినను నీ ముద్దుపాటల మరల మరల వినగోరు యభిలాష జనించుచుండెనే. నేనింకెవ్వరి పాటల వినఁగలను? హా! ప్రహ్లాదా (అనిగట్టిగ నఱచును).

(లోపలధ్వని "అయ్యా ఇదేవచ్చితి" నని)

హిరణ్య—తన్వీ! ఏమాశ్చర్యమిది? మనకుమారునిధ్వని విన్నట్టాయె? నాకేమైనను భ్రమయా! లేక నీకు నట్లేవినఁబడెనా?

లీలా—నాథా! నాకును నిక్కముగా వినఁబడియె.

(ప్రవేశము: ప్రహ్లాదుఁడు పాడుకొనుచు)

అనుబంధము 27.

లీలా—(పోయి గట్టిగా నాలింగనము చేసుకొనును)

హిరణ్య—(కొంతసేపు దిగ్భ్రమము నభినయించి తర్వాత పోయి ప్రహ్లాదునెత్తుకొని ముద్దాడి) నాతనుజా! మరల నాయొద్దకువచ్చితివా? ఇంక నీ దుర్వర్తము మానితివి గదా? అయ్యా! క్రూరాత్ముఁడనైన నేను నీకు శైలపాతశిక్ష విధించితినేయని నీ కాగ్రహము కలుగదుగదా? అయ్యా! నీవెట్లువచ్చితివి? ఆ కూపమునుండి యెట్లు తప్పించుకొంటివి? మహోన్నత స్థానమునుండి క్రిందఁబడుట కెట్లోర్చితివి? నీవేతప్పి వచ్చితివా లేక నాచారులేనినుఁద్రోయలేదా?

ప్రహ్లాద—అయ్యా! నీచారులు నన్ను కూపమునఁ ద్రోసెదమనిరి. ఎంతసేపుచూచినను ద్రోయరైరి. ఆ శైలశిఖరముపై నిద్రించితి. ఇంతకు కొంతముందు నిద్రనుండి లేచితి [illegible] యాపర్వతముక్రిందికి వచ్చియుంటి. వారేత్రోసిరో, నేనే పడితినో, న[illegible] వచ్చితి.



హిరణ్య—కుమారా! మిక్కిలి సంతసించితిని. నాభాగ్యవిశేషమునగదా నీవుమరలి వచ్చితివి ఇంకపోయినది పోవనిమ్ము. నీకుపట్టువడియున్న దుష్టమతను మానుము? ఆకలుపాత్మునిపేరెంచక నుడువకుము. నాతమ్ముని జంపిన పాపాత్ముఁడుగదావాఁడు.

ప్రహ్లాద—జనకా! తననామస్మరణచే యల్లవారికలుషములు నాశనముసేయనున్న ప్రభావముగల యాయిందిరావల్లభుని నీవుకలుపాత్ముఁడంటివే! ఇందుకు నేనెట్లోర్తును.

హిరణ్య—ఛీ-దురాత్మా! మరల నీమాటచెప్పుటకా నీవువచ్చితివి? కలుషమతులగు నాభటులు నేచెప్పినయాజ్ఞ నిర్వహింపక నిను శైలమునుండి బడఁద్రోయక స్వామిద్రోహమొనర్చియున్నారు కాబోలు? వారికిదగిన శిక్షయొసంగెద. అట్లుగాకున్న నీవు ప్రాణములతో నిటువచ్చియుందువా? ఓరీసేవకా!

[ప్ర: సేవకుఁడు.]

నీవీక్షణమున బోయి మంత్రిసత్తముని విప్రవజిత్తునిఁ దోడికొనిరమ్ము.

సేవక—చిత్తము.

హిరణ్య—లీలావతీ! చూచితివా యీదురాత్ముని కండక్రొవ్వు? ఇప్పుడువీఁడాడిన మాట యింకొక్కసారియాడిన నేవీనిఁజంపింపకవిడువను.

[పునః ప్రవేశము సేవకుఁడు.]

సేవక—దేవా! ఆచార్యులవారు విచ్చేసియున్నారు. మీమంత్రిసత్తముఁడు నిప్పుడే వచ్చెదనని నుడివె.

[ప్ర: శుక్రాచార్యుఁడు.]

శుక్ర—హిరణ్యకశిపూ! నీకుమారుని శైలమునుండి పడఁద్రోయించితివట. అదివిని నామనసు కళవళముఁజెందె. నీభటుఁడగు కాలనాభుఁడును నీకుమారుని శైలము నుండి యగాధకూపమునఁద్రోసినది నిక్కమనివచించె. నీతోమాటలాడవచ్చుచుండ దారిలో నీకుమారుఁడు బ్రతికివచ్చియున్నాఁడనితెలిసె. ఏమాశ్చర్యమిది?

హిరణ్య—బ్రతికివచ్చియున్నాఁడనియే దుఃఖించుచున్నాను. ఈకులనాశకుఁడు వచ్చియున్న నాకింత దుఃఖముండదుకదా? గురువర్యా! మీరును చూచితిరిగదా? చిన్నప్పటినుండి వీనికి హరిస్మరణయను దుర్మతమెట్లో పట్టువడియున్నది. ఎంతచెప్పినను ప్రాణములొప్పఁజెప్పును గాక, నదిమాత్రము మానడనుచున్నాఁడు. ఎట్లైనువీఁడు చావవలసినవాఁడేయగు. ఏదోయొక్కవిధానమునఁ జంపించెద.

శుక్ర—కుమారా! బాలుని మందజేయుటపాడియా? ఎట్టివిధానము పట్టువడినను నెట్లో యొకమార్గమునఁ ద్రిప్పజూడవలయుఁగాక చంపునంత [illegible]

## తృతీయాఙ్క-ద్వితీయరంగ.

హిరణ్య—అయ్యో! గురూత్తమా నాకేమిపగయా? నీవెఱుఁగవే? ఈరేఁడులోకముల నాయాజ్ఞ నిర్వహింపనివాఁడొకఁడున్నాఁడా? ఈబాలుని యహంకృతికి నేనోర్వఁగలనా? మీరెవరైననుద్బోధించి వానిమతము విడిపించితిరా ధన్యుఁడనయ్యెదఁగదా?

శుక్ర—లీలావతీదేవీ! నీవైన నుద్బోధింపకఁబోయితివా?

లీలా—ఆచార్యసత్తమా! నేను నెంతెంతోబోధించితి. ఎట్లును త్రిప్పజాలకున్నాను. నాథుని యాగ్రహముజూడఁజాలకున్నాను. మీరైన నుద్బోధించి నానాథునియభీష్టముఁ జెల్లింతురా?

శుక్ర—చూడుమింకొకసారి వానికిఁ జెప్పి?

హిరణ్య—గురువర్యా నేనొక. కార్యమునకై పోవలయు. నామంత్రియు రాఁడయ్యె. ఇప్పుడె వచ్చెద. ఇంతలో నీకష్టాత్ముని దుష్టమతమునుండి వారింపఁ నుద్బోధింపుఁడు.

(నిష్క్రమి).

లీల—(ప్రహ్లాదుని కౌగిలించి) అన్నా! నేనెన్నిమారులో వచించితినే. తండ్రిమనస్సునకు వెగటగు కార్యము జరుపవలదని వినకున్నావే. నేనేమి సేయుదును? అయ్యా! నీకంత భక్తియున్న వెలికిఁ జెప్పికొనక మదిలోననే యుంచుకొమ్మని సహితము చెప్పితినే? కుమారా! నీవు పెద్దవాఁడవై యుక్తాయుక్త పరిజ్ఞానము గలిగినపిదప నీయిచ్ఛవచ్చినట్టులాచరింతువుగాక, ఇప్పుడుమాత్రము నామాటఁ జెల్లుపుమా?

సీ. అన్నరో మదినెంత హరిభక్తియుండిన
నినుపార వెలికిరానీ యకయ్య
తనుఁగాంచి పెంచిన తండ్రియాడినమాట
పాటింపకుండుట పాపమయ్య
తనమాటవినకున్నఁ దప్పక నీతండ్రి తెంపుమై
నినుఁ జంపఁ బంపునయ్య
విభుఁడైన తండ్రియే వెసఁ జంపబంపిన నాతులిం
కెవరు నిన్బ్రోతురయ్య

తే. గీ. వంతలీవొందనెట్లు భరింతునయ్య
నీకుఁగీడైన నాకెంత శోకమయ్య
చావుగాకనన్బ్రోచు వారెవ్వరయ్య
లీల మాటలిప్పుడాలింపుమయ్య.



అయ్యో! నీవు శైలపతన విధికలిగినందున కింతవఱకు నేనెంత దుఃఖించితినో, యా దైవమే ఎఱుఁగు. నాభాగ్యవిశేషమున నెట్లో తప్పివచ్చితివి. ఇంకనుడుగుమా నీయాచరణము? చిన్నికుమారా! నీజనకుఁడు పట్టినపట్టుసాధింపక మానఁడు. నీవతనిమాట వినకున్న నిన్నుఁజంపక మానఁడు. నిష్కారణముగ మృతిగలిగించుకొందువేని దీని కెట్లోర్తును?

శుక్ర—చూచితివే బాలకా! నీతల్లిమాటలయందెంత యుక్తియున్నది. పుత్రతకు ఫలము జనకవాక్య పరిపాలనమే కదా? నిరంకుశాధికారముగల నీజనకుఁడు నీవుమాటతప్పిన నోర్వఁడు. నిను సంహరింపక మానఁడు. ఊరక వాగ్దోషమున సంహరింపఁబడుట వివేకమతమగునా?

ప్రహ్లాద—గురువర్యా! మాతా! మీమాటలకు నేనచ్చెరువొందితి. ఎన్నిధర్మములో తెలిసినవారలు మీకింతధర్మసూక్ష్మము తెలియఁగకుందురా? చంపవలయునన్న, పాలింపవలయునన్న, నందుకు జగదీశుఁడగు శ్రీవల్లభుఁడు కర్తగాక నితరులకు సాధ్యమా?
ఒకరినొకరు చంపువారలా? చంపనే చంపెరనుకొనుఁడు. అందుకేల యోచింపవలయు? శరీరముధరించి పుట్టిన మానవునికి చావెంతనిక్కవమో బ్రతుకంతనిక్కము కాదుగదా? చావు తప్పనది. స్థిరమైనది. బ్రతుకు సంశయమైనది. అస్థిరమైనది. ఇట్లుండఁజావునకు వెనుదీయవలయునా? నూరేడులకు చచ్చువాఁడు నిప్పుడే చచ్చెదఁగాక. భవతారకమై, యానందజనకమై, యప్రతిమానమైయున్న, శ్రీహరిస్మరణ నేమానుదునా? ఇంక నాకు జెప్పకుఁడు. ఇదికానిపని. బ్రతికియున్నను హరినన్నురక్షించువాఁడు. చచ్చిననతఁడే ననురమ్మనువాఁడు. మానను. మానను. అదిగో! ఆశ్రీహరి దివ్యమంగళ విగ్రహము ఎందుబోయినను నాకన్నుల కగపడుటమానదు. అదె! యాయిందిరావల్లభుఁ డందున్నవాఁడు. ఇందున్నవాఁడు. ఎందునునున్నవాఁడు.

శుక్ర—(స్వ) అహా! ఈకుమారునకెంతదృఢభక్తి. వీనితండ్రికెంతదృఢవైరము? నాకుఁ జూడఁ బుత్రునకుతండ్రిమృత్యువో! తండ్రికిపుత్రుడే మృత్యువో? తెలియఁగ రాకున్నది.

[పునః ప్ర: హిరణ్యకశిపుడు]

హిరణ్య—ఆచార్యా! సతీమణీ! ఎంతవరకు వచ్చియున్నది?

శుక్ర—(స్వ) కంఠమువఱకు వచ్చియున్నది. తలమున్కలొక్కటియే తక్కువ.

హిరణ్య—ఏమి యూరకుంటిరి? ఈదురాత్ముఁడు తనమతమును [illegible] మీమానమువలననే యెఱుఁగనయ్యె. విప్రజిత్తూ!

[ప్ర: దూరమున విప్రజిత్తు.]

విప్ర—మహాస్వామీ!

హిరణ్య—మంత్రీంద్రా! నేఁజెప్పితిఁగదా యీకుమారుని చావఁబట్టుదల? వీని నేఁక జంపుటకై యెవరినైన నేర్పఱుపుము. మండుచున్న యగ్నిలోనైచి చంపుమనుము. సముద్రమునముంచి గుండ్లపై నెత్తుమనుము. కాలవ్యాళముల రప్పించి కఱపించి చంపుమనుము. కొఱతవేసి శూలమున కెక్కించి తలనఱికించి ఏనుగులచేఁ ద్రొక్కించి రాళ్లు రువ్వించి, యేపథానమునైన సంహరించి యీసంతోషవార్త నాకెఱింగించి, నాతో బహుమతిఁ గైకొనుమనుము. కొనిపొమ్ము చండాలుని? (కాలదన్నును)

అనుబంధము 28.

శుక్ర—దైతేయచంద్రా! నామాట యంతపాటింపుము. నాకుమారులిదివఱకు వానిఁ బఠింపించి యున్నారుగదా? నేనొక్కింత విద్యఁ గఱపెద. తప్పక బుద్ధిమంతునిఁ గావించెద. నెలదినములలో నీయొద్దకరుదెంచి యిప్పటిప్రహ్లాదునికిని యప్పటిప్రహ్లాదునికినిఁ గల భేదము నీవే యెఱుంగునట్లొనర్చెద. ఇప్పటికి కోపముసంహరింపుము.

హిరణ్య—గురుపుంగవా! నీమాటకు మాఱాడువాఁడనా? ఎట్లయిన వీనిబుద్ధి మార్పిన నాకత్యంత సంతోషము జనించుఁగదా? అవశ్యము కొనిపొమ్ము. విప్రజిత్తూ! మా యాచార్యుఁడు తానింత ప్రయత్నముఁ జేసెదనని వచియించియున్నాఁడు. నెలదినములగడువొసఁగియున్నాఁడు. ఇదియేమాట. ఇంకొకసారి నాయొద్దకీకుమారునిఁ దేవలయునన్నఁ బరిత్యక్తహరిస్మరణునిఁగాఁ దేవలయు, లేదా సంహరింపవలయు. ఇంకొకసారి యాజ్ఞవలదు. గురుపులవారియింట వీఁడెట్లు నడుచుకొనుటయు విచారించుకొనుచుండుము. వీనిబుద్ధి తిరుగకపోయెనా, నేఁజెప్పినవిధానము నన్నింకొకసారియడుగకయే చంపఁబంపుము. శైలపాత మొనర్చియు బ్రదికివచ్చిన యీదురాత్ముఁ డింకెట్లుతప్పించుకొనునో చూచెద? (శుక్ర-ప్రహ్లాద—నిష్క్రమి)

లీలా—నాథా! నేను హతభాగ్యురాలను. ఇట్టికుమారునిఁ గనియు వాఁడు లేకుండనొనర్చుకొనువిధి ఘటింపనున్నది. వాఁడు వానిమతము నెందుకైనను విడువఁడని నాకు దోఁచుచున్నది. అయ్యో! పరమాద్భుతసుధీసమపేతుఁడగు నాముద్దుకుమారుఁడు నాకు లేకుండెడుఁగా? నీవైనఁ గరుణించి వానియిచ్ఛచొప్పున వానిఁ బోనివ్వరాదా?

హిరణ్య—మానవతీమణీ! ఇదిసరియైనమార్గమగునా. నాకొడుకువలననే నాకిట్టితిరస్కారములుగలుగఁగూడునా? చూచినవారేమందురు? తనకొడుకునే యాజ్ఞలోనుంచుకొనఁజా[illegible]యాజ్ఞ నింకెవరు నిర్వహింతురు? అదిగాక నాకాజన్మశత్రువగు వాని నాయెదుటనే ప్రశంసించుచుండఁజూచి నేనోర్వఁగలనా?



శా. అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబుఖండించి శే
షాంగశ్రేణికిరక్ష సేయుక్రియ నాయాజ్ఞన్ గులద్రోహియౌ
స్సంగుఁ గేశవపక్షపాతి నధముం జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జరించెదన్ గులము నిర్దోషంబుగావించెదన్

(లీలావతి దుఃఖముతో నిష్క్ర.)

సేవక—దైతేయచంద్రా! నారదఋషులు వచ్చియున్నారు.

అనుబంధము 29.

(హిరణ్యకశిపుఁడు లేచిపోయి నారదఋషినిఁ బిలుచుకొనివచ్చి నమస్కరించి కూర్చుండఁజేయును).

నారద—హిరణ్యకశిపూ! ఏమి మిక్కిలిచింతతో నున్నట్లున్నది?

హిరణ్య—సంయమీంద్రా! నేనేమనివచింతును? నీయట్టివాఁడు సహితము చిరకాలము నుండియున్న నారాయణస్మరణమాని నావైపుఁగల యభిమానమున నాస్మరణచేయుచుండుటే? ఇట్లుండ నాకొడుకునకు నెవరుగఱపియున్నారో నారాయణస్మరణవ్యాధిజనియించియున్నది. ఎంతచెప్పినను నెవరుచెప్పినను వినఁడు. అయ్యో! నారదా! ఆదురాత్ముఁడగు నింద్రుఁడు నాసతీమణినిఁ జెఱపట్టుకొనిపోవుచుండ నీవువిడిపించి నాకెంతయు నపకార మొనర్చితివి. నాసతికిఁ గలిగిన శిశువుబుట్టినవెంటనే ఖండించు నుద్దేశమున చెఱపట్టితినని వాఁడు నీతోఁ జెప్పఁడా? అట్లేఖండించియున్న నాకెంతో సంతోషముండెడి. నాకున్నపీడ వీడుచుండెఁగదా?

నారద—అట్లనా? నీకంత దుస్సాధ్యముగానున్నాఁడా? చిన్నిపాపఁడు వాఁడు నిన్నంత తిరస్కరించువాఁడా? నాకాశ్చర్యముజనించె. అట్టివానిమాత్రము మననీయరాదు. మననిచ్చిన నీయశమునకే కళంకము పెట్టినట్లగు. నీతమ్ముని జంపిన మహావిరోధిని నీచిన్నబాలుఁడు నీయెదుటనే నుతించునది వినియోర్చుటకు సాధ్యమగునా? అట్టి యహంకారబుద్ధిమాత్రము పెరుగనియ్యరాదు. తుదకువాఁడుపోయిన నేమి మీరిరువురుఁ జల్లగనున్న, నెందఱట్టి కుమారులు గల్గరు?

హిరణ్య—శబాస్. నారదా! నీవు నిష్పక్షపాతివి. నీకున్నగుణము మఱియొకనికిఁ గలుగదు. నారదా! భోజనమునకు వేళయాయె. దయచేయుఁడు. (నిష్క్ర.)

నారద—"గోవింద దామోదర" పాటపాడుచు—(నిష్క్ర.)



## చతుర్థాంకము-తృతీయరంగము.

---

### పాఠశాల.

[ప్ర: బాలురు, ప్రహ్లాదుఁడు, శుక్రుఁడు, చండుఁడు, అమర్కుఁడు ]

శుక్ర—ప్రహ్లాదకుమారా! మీతండ్రితో నేఁజేసియున్న నెలదినములగడువు మీఱఁజొచ్చె. ఈనెలదినములు నుత్తమోత్తములగు పాఠముల నీకుగ్గడించితి. వానియర్థము మఱవవుగదా? రేపు నీతండ్రియొద్దకుఁ బోవుదమా?

ప్రహ్లాద—అవశ్యకముగాఁ బోవుదము.

శుక్ర—ఇప్పుడు బుద్ధిమంతుఁడవు. పోయినప్పుడు నేఁజెప్పిన పాఠములనుమాత్రమువల్లించి మీతండ్రికేవగలుగు విషయమెన్నఁటికి నుగ్గడింపకుము. ఈదినము సంతోషపూర్వకముగా మాయింట పండుగఁగావింపబడియున్నది. చక్కఁగ భోజనమొనర్చి, రేపు మీయయ్యయొద్దకుఁ బోవుదము. బాలకులారా! మీకెల్లరు నేఁడుమాయింటనే భుజింపవలయు. మేముస్నానమునకు వెడలెదము. మీరింకింతసేపు మీపాఠముల వల్లించిపోయి స్నానమొనర్చిరండు. (శుక్ర, చండ, అమర్క నిష్క్రి.)

1వ బాలకుఁడు—ప్రహ్లాదా! ఏమి మనయాచార్యులవారేమేమో చెప్పుచున్నారే? ఎల్లశాస్త్రముల చెప్పుటనుండే నేర్చుకొను నీకు వారింతచెప్పవలయునా?

ప్రహ్లాద—బాలకులారా! ఏమో మనగురుఁడు చెప్పుచున్నాఁడని నేనూఁకొట్టెదగాక, మాగురువులవారు చెప్పుమార్గము ఋజుమార్గము కానేకాదు.

2వ బాలకుఁడు—అట్లనా! ఏమిచిత్రము వింటిమి! అదిఋజుమార్గముఁగాకున్న నింకేది ఋజుమార్గము! అదినీకెట్లుదెలిసె! ఏదీ ఏదీ నీనోటనింత విననగోరెదము!

ప్రహ్లాద—ఇట్లువినుఁడు. మీరును యోచింపుఁడు. మనప్రాయపు బాలుకి నెలదినములలో నెందఱోగతించిరికదా! వారేలగతింపవలయు! మనమేలజీవించియుండవలయు! వారి శరీరములెక్కడఁబోయె! అవి మొదట వారికెట్లుకలిగియుండె! ఇవి ఇంచుక యోచింతురేని కర్మానుగుణముననగాక దీనికింకొకకారణముండునే! శరీరమువలన ప్రయోజనముండునే యన్ననొక్కింత ప్రాణముపోయిన వెంటనే కుళ్లి దుర్గంధముపట్టి పురుగులుపడి నశింపదా! దానిఁగాల్చెదరు, పూడ్చెదరు, పక్షిసంఘమున కాహారముగా నొనర్చెదరు. కావున శరీరము ముఖ్యముకాదుగదా! ఆశరీరములోనున్న యింకొక పదార్థము [illegible] దాని స్వాధీనముంచుకొని యుండునది. ఆపదార్థమేది! అదియే జీవుఁడు-ఆత్మ-ధ్వని మనచెవులవిందుము. పదార్థముల మనలఁజూతుకన్నుఁ



కన్నులుచూచునా! చెవులువినునా; జీవాత్మకదా కన్నుల మార్గమునఁజూచుట చెవులమార్గమున వినుట! జీవాత్మలేని శరీరము నిలువఁజాలదుగాని, శరీరములేని జీవాత్మ నాశనమొందదు. (అట్లునాశనమొందకున్న నెక్కడఁబోవును! పుణ్యపాపముల ఫలమనుభవించి వెంటవచ్చిన కర్మకొలది మరల శరీరాంతమున్ గ్రహించును. అదియేపుట్టుక. అందునకొన్నాళ్లుండి మరల నశించును. ఇట్లేపుట్టుచు-చచ్చుచు. చచ్చుచు-పుట్టుచు నెపుతెగకుండును. ఆజీవాత్మ మరల పుట్టకుండుటకు నుపాయము లేదా! అదియేతరణోపాయము. అదిదేనివలన లభించును? ఊరక శాస్త్రములవలనఁ ప్రయోజనమేమి "వర్ణచ్ఛేదనపూర్వయోః" అని చదివితిమిగదా! ఆధాతువలన నెన్ని శబ్దములు బుట్టిన మనకేమి ప్రయోజనము కలుగు? అట్టిచదువులెన్ని చదివిన నాత్మతారకములుగావు.) మనవారు గృహస్థమార్గము నవలంబించి సంసారక్లేశములజిక్కి చచ్చుచు పుట్టుచు, పుట్టుచు చచ్చుచు, నెన్నిజన్మములెత్తినను బంధముల మానఁజాలకున్నారు. తల్లియని, తండ్రియనిఁ కొడుకని బిడ్డయని యూరక వ్యామోహమున మడియుచున్నారు. ఈజన్మమునఁ దండ్రియైన పూర్వజన్మమున రాఁగలజన్మమున నాతడెవరు? ఇది వివేకమార్గముకాదు.

గీ॥ దీనశుభములేదు దివ్యకీర్తియులేదు
జగతిఁబుట్టిపుట్టి చచ్చిచచ్చి
పొరలనేల నెందుపుట్టనిచావని
త్రోవవెదకికొనుట దొడ్డబుద్ధి.

1వ బాలక—అయ్యా! నీవుచెప్పిన మార్గము వినినంతనే సన్మార్గమనిపించె. అయిన మనకెల్లరకు తరణోపాయమేదికలదు?

ప్రహ్లాద—కలవు, మార్గములెన్నియోకలవు. తెలియక యాచరింపని వారట్లుండ తెలిసి యాచరింపనివారి సంఖ్యయే యీలోకమున మెండు. అవిచెప్పువారుకలుగుటదుర్లభము. చెప్పినఁ జెప్పుదురుగాక వారేయాత్రోవఁద్రొక్కరు. ఇట్లేప్రపంచమంతయు రాగమయమై జనులు భవబంధములు బాయఁజాలక సంసారక్లేశములమునిఁగి తేలుచుందురు. ఒకవేళమార్గము చూపిన దాని ననుసరించువారు లభించుట పరమదుర్లభము. మీకామార్గముజూపిన మీరొప్పుకొందురా? ఆచరింతురా?

2వ బాలక—అయ్యా! నీవు పుట్టిననాఁటినుండి మహామహుఁడవు. కష్టొందినవాఁడవు. చక్రవర్తికుమారుఁడవు. శైలపతన మొనరించియుండినను [illegible]న మహాపురుషుఁడవు. నీమాట మేముద్రోయుదుమా!

ప్రహ్లాద—అట్లయిన వినుఁడు. సంసారమనునది గొప్పసముద్రము. మన్మునెల్లరముంచునది. అందుమునిఁగితిమా, లోపల చిమ్మచీకటి. కన్నులుగానరావు. వెలుతురు తెలియదు. జలజంతువులెన్నియో మ్రింగుటకు కాచుకొనియుండును. వాని మీఁదఁజాలము. కన్నులు మూసుకొనియే వానినోటఁబడవలయు. సుఖములేనేలేదు. బ్రతికినన్నాళ్లు దుఃఖమే. అదిమనము పరిగ్రహింపవచ్చునా!

బాలకులు—కూడదు, కూడదు, మనకు సంసారమువలదు.

ప్రహ్లాద—అట్లయిన వినుఁడు. దీనినుండితరింపవలయునన్న మనకొకటేసాధనము తారకుడునొకడే. అతఁడు తననామస్మరణసేసి తన్నుభక్తితోఁ బూజించువారికి సంసృతి క్లేశములు దప్పించును. అతఁడుతప్ప రక్షకుఁడింకలేడు.

బాలకులు—ఎవఁడతఁడు. ఎవఁడతఁడు! అతనిస్మరింతము. భజింతము. ఉపాసింతము.

ప్రహ్లాద—అయిన వినుఁడు. అతఁడు వైకుంఠలోకముననుండువాఁడు. ఆదిమధ్యాంతము లెఱుఁగనివాఁడు. భక్తులపాలిటిచింతామణి. నారాయణుడు. ఆతని కరుణపడయ వలయునన్న నేండ్లకొలదిఁ బూజింపఁబనిలేదు. కాయము శుష్కింపఁదపముసేయ బనిలేదు. భక్తిమైనతని నామముస్మరించి భజించినచాలును. అతఁడు జగద్వ్యాప్తుఁడు. కేశవాదినామము లెన్నియోగలవాఁడు. అతనిభజించిన మనకు భవబంధములు వీడును.

## అనుబంధము 30.

బాలకులు—అయినఁ బ్రారంభింతము. ఎట్లుభజింపవలయునో యెఱిగించి మాకుమార్గ దర్శివికము.

ప్రహ్లాద—(లెండు అని బాలకులందరితో నిలువఁబడి భజనము సేయును).

## అనుబంధము 31.

[పునః ప్రవేశము: శుక్రచార్యులు.]

శుక్ర—(బాలకులఁబిలిచి) బాలకులారా! ఏమిమీయాగడము! మీపాఠములమాని యిట్లేల యెగురులాడెదరు!

1వ బాలక—అయ్యా! ఇవియే మీపుస్తకములు. ఈపాఠములు మాకువలదు. ఇవిమీరే వైకొనుఁడు. మాయాచార్యుఁడు ప్రహ్లాదుఁడు. మాకుతరుణోపాయము గలిగించి యున్నాఁడు. దానిఁజూచుకొందుము.

2వ బాలక—అయ్యా! ఇన్ని సంవత్సరములనుండి మాకెన్నియో పాఠములఁజెప్పితిరి. ఈ[illegible] నేర్పినపాఠములొకనాడైనఁ జెప్పకపోయితిరే? సంసారసముద్రమున మునిఁచెడిపాఠములే చెప్పుచువచ్చితిరే! (అని పుస్తకములఁ బారవేయును).



3వ బాలక—కానిరా. ఊరకేల యాలస్యముచేసెదరు? మనపాఠము లొప్పఁజెప్పెదము. (అని యందఱు భజనచేయుచు నెగురులాడెదరు).

శుక్ర—ప్రహ్లాదా! ఇదియా మాకిచ్చు గురుదక్షిణ? "తాఁజెడ్డకోతి వనమెల్లఁజెరచె" నన్నట్లుచేసితివే. పోదముర మ్ము నీతండ్రియొద్దకు. నీదురుద్యోగమునకు ఫలమనుభవింపు గాక. (నిష్క్ర-౧).



## చతుర్థాఙ్కము-చతుర్థరంగము.

—o—

## సముద్రము.

[ప్రవేశము: ప్రహ్లాదునిఁబట్టుకొని కాలనాభుఁడు వజ్రదంతుఁడు మొదలగువారు]

(ప్రహ్లాదుఁడు హరిభజనము సేయుచుండును)

## అనుబంధము 32.

కాలనాభ—ఓరి! దుర్మార్గబాలకుఁడా! ఇంక నీయాయువుముగిసె. ఇప్పుడైన నీవుహరి స్మరణమానితినని వచనమిచ్చిన మీతండ్రితో నెటులైనఁజెప్పి నిన్ను మన్నింపఁజేయుదము. లేకున్న నిదె సముద్రమున నిముదూరముగొనిపోయి పాఱవేసివచ్చెదము.

ప్రహ్లాద—ఈజన్మమున హరిస్మరణమానుట నాచేతఁగానిపని.

కాలనాభ— సీ. నుడిరాని ప్రేలెదుబుడుతఁడ వీవునీకింత
కావరమానె హీనకర్మ

ప్రహ్లాద— అరుదారుభక్తిమై హరినామభజనంబుగడఁగి
చేయుట యిదికావరంబె

కాలనాభ— విడువిడుమాకూఁత విడకున్న నీవారినిధి
ముంచిచంపెద నిన్నుఁగూళ

ప్రహ్లాద— వేయుశ్రీహరి ప్రాపు గలిగియుండఁగ
నిట్టిత్రోయుధుల్ నన్నేమిసేయునయ్యో

కాలనాభ—ఛీ! దురాత్మక హరిపేరు సెప్పకింక

ప్రహ్లాద— మదినడరియుండు నాపేరువదలనగునె

కాలనాభ—రమ్ము ముంచెదఁ దీసెదఁ బ్రాణసమితి

ప్రహ్లాద— నటులె కానిమ్ము మీదప నాహరిగలండు.

కాల—అట్లయిన నీయాశ్వాసము ముగిసె, పోదమురమ్ము.

(అని ప్రహ్లాదునీడ్చుచుండ).

[ప్రవేశము: బాలకులు.]

బాలకులు—అయ్యో! అతని విడిచిపెట్టుఁడు. మమ్మెవ్వరినైన, లేక మమ్మందఱినైనఁ గొనిపోయి సముద్రమున ముంచి వేయుఁడు.

కాలనాభ—దురాత్ములారా! మీకింత యహంకారమా.

(అని బాలకులఁగొట్టి పరువెత్తించును.)

కాలనాభ—(ప్రహ్లాదునిఁ గొనిపోయి సముద్రమున వైచును. ప్రహ్లాదుఁడు డీదుకొనుచుఁ బోవుచుండ) (యవనికదిగఁజారును)

—❀❀—

## చతుర్థాఙ్కము-పఞ్చమరంగము.

### వీధి.

[ప్రవేశము: బాలకులు.]

1వ బాలక—ఏమి ప్రభావమురా ప్రహ్లాదునిది? చిన్నిపాపఁడై సముద్రమధ్యమునఁబడి యీదుకొనిపోవబట్టెను. అప్పుడా రాక్షస దురాత్ములు వాని సముద్రమధ్యమునకుఁ బట్టుకొనివచ్చి లోనముంచిరి. విడువకయే పోయిరి. పదిగడియలట్లు పట్టియుంచి విడువగా నారాయణస్మరణ యొనర్చుచు నట్టె లేచెను.

2వ బాలక—మరల వానిఁబట్టి ముంచలేదా?

1వ బాలక—ముంచుటకని పట్టబోవవారికిఁ జిక్కకయే దూరముపోయెను. ఇంతలో నా రాక్షసులెక్కియున్న పడవ గొప్పగాలికిఁ దలక్రిందై యారాక్షసులే మునుఁగఁ జొచ్చిరి. అప్పుడా మహాత్ముఁడు నారాయణభజన మొనర్చుచు లక్ష్మీవల్లభా! వీరిని రక్షింపుమని వేఁడుకొని చావనైయున్న యాయిద్దరి రాక్షసుల రెండుచేతులతో నీడ్చుకొనిపోయి గట్టు జేర్చెను. వారు మృతతుల్యులై ప్రహ్లాదునిఁ గొనియాడుచు నిండ్లఁజేరిరి.



1వ బాలక—చూచితిరా! ఇదియంతయు హరిస్మరణ ప్రభావము. మాయాచార్యుఁడగు ప్రహ్లాదుఁడు మాకు తత్త్వోపదేశమునుఁ జేసియున్నాఁడు. ఆస్మరణమాత్రము మేము గట్టిగఁబట్టితిమా మనకీడు లేదు. ఏకీడును రాదు. (అని భజనము చేయుచుండ ప్రవేశము మఱియొక బాలకుఁడు)

3వ బాలక—మిత్రులారా! వినలేదా? ప్రహ్లాదుఁడు గట్టుచేరి తండ్రియొద్దకుబోయి పాద చూపినవెంటనే యాదురాత్ముఁడాజ్యాహుతిఁగొన్న యగ్నివలె మండిపడి తనయుత్తర సేవకులఁ బురికొల్పి పాములచేఁ బ్రహ్లాదుని గఱపించుటకై యుత్తరవిచ్చియున్నాఁడు. అయ్యో! యింక మాయాచార్యుని పాములు గఱచిచంపునే? ఎట్లుచేయుదము?

4వ బాలక—మనమందఱముపోయి ఆపాములవాఁడు తెచ్చిన సర్పములన్నిటిని జంపి వేయుదము.

1వ బాలక—అవిజంపిన వేఱొకొన్ని వచ్చును. దానివలన నేమియుఁ బ్రయోజనము లేదు. సముద్రమునుండి యీఁదివచ్చిన మహాత్ముని పాములేమి చేయురా? మనమేమియు భయపడవలదు. అతఁడు నమ్మిన నారాయణుఁడే యతని పాలనుండువాఁడు. పోదము రండు.

అనుబంధము 33. (నిష్క్ర)

---

## చతుర్థాఙ్కము-షష్ఠమరంగము.

### మేడ.

[ప్రవేశము: పాములవాఁడు పాములతో].

పాముల—పిల్లోని చంపితే పక్కవూరు యిస్తాడంట. యెందుకబ్బా! మాపాము వొక్క దానిపంపితే అరగడియలో బూడిద సేయదూ? అందుకే నమ్మకంగా చంపేదానికి రెండు పాములు తెచ్చియుండాను. అపిల్లోడు యిక్కడికే వస్తాడంట. రెండున్ను విడిచేస్తా—అదిగో! వస్తుండాడు.

[ప్రవేశము: ప్రహ్లాదుఁడు పాడుచు.]

అనుబంధము 34.

పాముల—(రెండుపాముల వానిపైవిడచును. అవికఱవమునుపే రెండుగరుడపక్షులు ప్రవేశించి పాముల నెత్తుకొనిపోవును) అయ్యో! నాబంగారుపాములు పోయెనే (అని ఏడ్చును) (యవనిక దిగజారును).

—) — చతుర్థాఙ్కము సమాప్తము

శ్రీ

# ప్రహ్లాద నాటకము

## పఞ్చమాఙ్కము-ప్రథమరంగము.

హిరణ్యకశిపు నగరు.

[ప్రవేశము: హిరణ్యకశిపుఁడు లీలావతి.]

లీలా — నాథా! ఈకార్యము మాత్రము వలదు. ఇంకనైన వాని ననుగ్రహింపుము. మన చేతులార మనబాలునికి విషమీవలయునన్న, నేట్టికాలమనవలయును? అయ్యో! నేనెట్లులోర్తును? వలదు-వలదు. నను మన్నింపుము. ఆవిషము నాకిమ్ము. నేమ్రింగెందెద. పిదప నీయిష్టమునకు వచ్చినభంగి వానిఁజంపుము.

హిరణ్య — తరుణీ! నీకిట్టియవివేకము? ఇంతదుర్మార్గుఁడె నన్ను నరకుఁ సేయఁగ నిపాఁడు మనియుండిన రాష్ట్రమంతయుఁ జెడిపోవుఁగదా? చూడుమప్పుడె మనయూరిబాలురకు వానియుపదేశము పట్టువడి, యసాధ్యముగా హరిభజన మొనర్చుచు నూరిపెద్దలకు వారేయుపదేశకులైయున్నారఁట? ఇంత నేబ్రతికియుండి యేమిఫలము? వానిఁ జంపనేవలయు. కావున నీవిషముఁ దెప్పించితి. శైలపాత మొనర్చినప్పుడు నాభటులే పొరబాటొనర్చి యుండవలయు. సముద్రమునఁ ద్రోసినవారును వారేగ్రైయైనందున, వారితరులకులోనై చక్కఁగ నాకార్యము నిర్వహింపక సముద్రమునఁ బడవైచినట్లు బడవైచి వానినీఁదించుకొని తెచ్చి, వాఁడే తమ్ముద్ధరించినట్లు నాతో నబద్ధములాడి యుందురని నాకు దోఁచుచున్నది. ఇంక నాపాములవాఁడన్న నో, వాఁడులోఁబడుట యేమియెక్కువ? గరుడపక్షులువచ్చి పాములనెత్తుకొని పోయినట్టు నాతో నబద్ధములు చెప్పియుండవచ్చు. కావున నేనెవ్వరినమ్ముటకును సాధ్యముగాదు. నేనైన, నీవైనఁ జేతులార నీకార్యము సేయకున్న నాకువిశ్వాసముగలుగదు. నాకుఁజూడ నారాష్ట్రములోని వారందఱుఁ జిన్నవాడని ప్రహ్లాదునియెడఁ బక్షపాతముకలిగి నాయాజ్ఞ నిర్వహించుటకుఁ గొంకుచున్నారని నేనెంచెద. అదిగో వచ్చుచున్నాఁడు. నేనేయొసంగెద వానికీవిషము? వాఁడు తీసికొనకున్న నీవైన బుజ్జగించి త్రాగునట్లొనర్పుము. అక్కడికి సాధ్యముకాకపోయెనా, సేవకులఁ బిలిపించి క్రిందఁబడఁద్రోసి బలవంతమున నేనే త్రావించెద.



[ప్రవేశము: ప్రహ్లాదుఁడు హరిభజన చేయుచు.]

ప్రహ్లాదా! ఇటురమ్ము. ఇదే యీపాత్రమున విషమున్నది. ఈశ్వరుఁడు మ్రింగినహాలాహలమునకు రెండవదియని పేరొందినది. అశ్వినీదేవతలనడిగి నిర్బంధించి దీనిఁ జేయించియున్నాను. ఇంకనీకక్కుముక్కులాడనివ్వను. చెప్పుము కడసారి. నీవు హరిస్మరణమానెదవా, లేక యీవిషముభుజించి చచ్చెదవా?

### అనుబంధము 35.

ప్రహ్లాద — (చేయిసాచి) అయ్యా! నీవు నాకు పరమోపకారివి. రెండుమార్గముల నాకుఁ జూపితివి. హరిస్మరణ మిడువుమని యొక్కమార్గమే నాకుఁజూపిన దుఃఖించుచుంటిని కాని, యిప్పుడు కడుసంతోషమయ్యె. తెమ్ము ఆవిషమునిట్లందిమ్ము.

లీలా — కుమారా! ప్రహ్లాదా! వదలుమా! అయ్యో! ఆవిషమిమింక నాలుకపైఁబడిన నెవఁడుగాని మడియునఁట. వదలుము హరిస్మరణ విడిచితినను ము.

ప్రహ్లాద — అమ్మా! నీవూరకుండుము. చూచెద నావిషమునందట్టి మహాత్మ్యమున్నదేమో? (విషపాత్రచేఁబట్టుకొని) అయ్యా! యీవిషమంత చెడ్డదియా? హాలహలప్రతిమానమా? (అని నోటికెత్తి త్రాగును).

లీలా — (హా! యని గట్టిగనఱచి మూర్ఛిల్లును).

ప్రహ్లాద — అమ్మా! అమ్మా! (అనితల్లియొద్దకుఁబోయి శిశిరోపచారములఁ జేయును)...

### అనుబంధము 36.

హిరణ్య — (స్వ) అహో! ఏమనవలయు? ఆవిషముతప్పక చంపునదియని చక్కఁగ పరీక్షించి గుణముగుణించియుంటినే? త్రాగుమనకమునుపే పానకము త్రావినట్లు త్రావియుంచుకంతయుఁ దెలివిచెడకయున్నాఁడు.

చం॥ "ఏటుఁగడు జీవనౌషధము నెవ్వరుభర్తలు లేరు బాధలకా
దటుఁగడునైజ తేజమున తథ్యముజాడ్యములేదు మిక్కిలిన్
మెఱయుచునున్న పాడొకని మేషముదైన్యము నొందడింకనే
తెఱఁగున దంతు వేసరితి దివ్యము వీని ప్రభావమెట్టిదో"॥

(యవనికదిగజారును)

## పంచమాఙ్కము-ద్వితీయరంగము.

### అడవి.

[ఒక్కప్రక్కన నేనుఁగులగుంపు. వెనుకభాగమున యవనికాభ్యంతరము మాత్రముగలిగి
ప్రజ్వరిల్లుచున్న యగ్నిజ్వాలలు. ప్రక్కనబాలకులు. మధ్యప్రదేశమున
ప్రహ్లాదుఁడును రాక్షసులును.]

రాక్షసులు—ప్రహ్లాదా! అదే యేనుఁగులు వచ్చుచున్నవి. ఆవెనుక నగ్నిమండుచున్నది. మావిభుని యాజ్ఞమాత్రే యున్నది. నీవుహరిస్మరణ విడిచితివంటివా నిన్నుదనరొద్దకుఁ దెమ్మనియె. లేదంటివా నిన్నీయెడఁ గట్టివేసి యేనుగులతోఁ ద్రొక్కింపుమని మాకు నాజ్ఞ. హరిస్మరణ విడిచెదనందువా—లేదా?

ప్రహ్లాద—ఇదిగో! హరిస్మరణము దిగ్దేశముల వెదచల్లుటకై విడుచుచున్నాను. (అని గట్టిగ పాడును).

### అనుబంధము 37.

రాక్షసులు—(ప్రహ్లాదుఁడు పాటపాడుచుండఁగనే క్రిందఁగెడపి చేతులుకాళ్లుబిగఁగట్టి ఏనుఁగుల విడుఁవుఁడు అని గట్టిగా నఱుతురు).

బాలకులు—(ముందఱికివచ్చి) అయ్యో! అయ్యో! ఈపాడేనుఁగులు మాయాచార్యులఁ జంపుచున్నవే! మనమైనను బోయి యడ్డపడుదుమా?

1వ బాలక—మిత్రులారా! మనముపోయి యేమియుఁ బ్రయోజనములేదు. ఆరాక్షసులు మమ్ములఁద త్రొక్కివేయుదురు. నారాయణప్రభావమున మనయాచార్యునకేమియు బాధ గలుగఁజాలదు. కావున నీనాఁడందఱుఁ జేరి మాగురుఁడు వెలికివచ్చిన వెంటనే యతని నేకాంతమునకుఁ బిలుచుకొనిబోయి మనమందఱముగలసి హిరణ్యకశిపుని రాష్ట్రము విడిచిపోయి వేఱొకచోట సుఖముగానుందమని బోధింతము. అతనికివేఱుబాధలు లేకుండఁజేయుదము.

[ప్రవేశము: ఏలుగుఁలు ప్రహ్లాదునిఁ ద్రొక్కఁచుఁబోవును.] యా

ప్రహ్లా—(అను: 37 ఒక్క చరణము పాడుచుండును).

రాక్షసులు—దురాత్మా! ఇంకనుఁజావవా? కానిమ్ము. ఏనుఁగులుద్రొక్కి చంపిన నీశవము నగ్నిలోవేయ నెంచియుంటిమి. ఇప్పుడటుకాకున్న నిన్నేయందుంచి దహింతము. (అని యెత్తుకొనిపోవుదురు).

[వెనుక యవనికనెత్తగా గొప్పయగ్నిఁ గనిపించును. దానినడుమ ప్రహ్లాదుఁడు నిలిచికొని
[అను: 87 రెండవ చరణము పాడుచుండ ]
(యవనిక దిగజాఱును).



## పఞ్చమాఙ్కము-తృతీయరంగము.

—✻—

### వీధి.

[ప్రవేశము: బాలకులు ]

1వ బాలక—మనతల్లిదండ్రులిట్లు చెప్పుచున్నారే? మనమేమి సేయవలయు? అదిగో! నీతివేదివచ్చెను.

[ప్రవేశము: నీతివేదియను బాలుఁడు.]

నీతివేది—ఏమిరా? నన్నిక్కడికేల రమ్మని చెప్పనంపితిరి?

1వ బాలక—ఆయిన నీవేమియు వినలేదా?

నీతివేది—ఏమియువినలేదే? నిన్న ప్రహ్లాదుని నేనుఁగులతోఁ ద్రొక్కించిరఁట. మీ రందఱు బోయియుంటిరఁట. ఇంతమాత్రము దెలిసె. ఇప్పటికి నాకింకను దలనొప్పి దుర్భరముగా నున్నది.

1వ బాలక—వీనికెట్లు తెలియవలయు. మనకుఁ దల్లిదండ్రులున్నారు గనుక వారిగోడు వారుచెప్పుకొనిరి. పాపమునీతివేదికేమి తల్లియా తండ్రియా, వానికెవరు చెప్పవలయు.

నీతివేది—ఏమిరా మీ తల్లిదండ్రులగోడు? వినుటకు చిత్రముగానున్నది. నాకింత యెఱిఁగింపుఁడు.

1వ బాలకా—నీ కెఱిఁగింపక మేమేమైన నడచుచుంటిమా? వినుము. ఆనాడు మన యాచార్యుని సముద్రమునవైవఁబోవ మనమువలదని యడ్డముపోవలేదా? ఆ వృత్తాంతము హిరణ్యకశిపునికి, నివేదించినంతట నాతఁడు మండిపడియెనఁట! మరలనిన్న మనముపోయిన వృత్తాంతము రాక్షసులు రాజుతో జెప్పిరఁట! రాజు రేపు నిండు సభ చేయనున్నాఁడఁట! ఆసభయెదుటనే యురిదీయుటకై ప్రానుగట్టించియున్నాఁడఁట. ప్రహ్లాదాచార్యుని నురిదీసినపిదప మమ్మెల్లర వరుసగా నురిదీయుటకై యేర్పరచి యున్నాఁడఁట. మమ్మెల్లఁబట్టుకొని నిర్బంధమున నుంచుటకు సేవకుల మాయిండ్లకీరాత్రియే పంపుచున్నాఁడఁట. మా తలితండ్రులు మమ్మెక్కడికైన వెడలిపొండని బోధించి యున్నారు. ఏమిచేయుదమని యాలోచించుటకై యిందుఁజేరితిమి. ఇదియేమాకథ.

నీతి—మీరేమియు నిర్ధారమొనర్చియున్నారు?

1వ బాలక—ఏమియు నిర్ధారమొనర్పలేదు. నీకొఱకై వేచియుంటిమి. ఇందేయుండి ప్రహ్లాదునితోఁగూడ నురిదీయఁబడుదమా లేక. దేశభ్రష్టులమై కాన కేగుఁడఁ బోవుదమా? ఈ రెంటిలో నొకటికర్తవ్యము.

నీతివేది—నాయభిప్రాయము చెప్పుదునా?

1వ బాలక—చెప్పుము.

నీతివేది—ప్రహ్లాదాచార్యుని నొంటిగవిడిచి మనము వెడలిపోవుట యెంతయు నయుక్తము. అతఁడు ఁదీయబడఁజాలఁడు. అతని నారాయణుఁడు కాపాడఁగలవాఁడు. మన యాచార్యుఁడు మమ్ము గాపాడువాఁడు. ఒకవేళ నతఁడు ఁదీయఁబడి ప్రాణములఁ బాసెనా, యతఁడు పోయినపిదప మనముండియుఁ బ్రయోజనము లేదు. కావున సంతోషమునఁ మృతి జెందుదము. ఒకవేళ నతఁడు కాపాడఁబడి మమ్ము రివేసిరా యదియే మేమిచ్చగల యాచార్య సంభావయని యెంతము. ఎట్లుచూచిన నిదియే విధానము.

బాలకులు—భళీ! భళీ! నీతివేదీ బాగుగఁ జెప్పితివి. మాకెల్లరకిదియే యభీష్టము. జయ జయ, మాధవా జయగోవిందా! (అని భజనచేయుదురు.)

## అనుబంధము 38.

(నిష్క్రమింతురు)

---

## పంచమాఙ్కము-తురీయరఙ్గము.

[ప్రవేశము హిరణ్యకశిపుఁడు, మంత్రులు, సేనాధిపులు, సేవకులు, శుక్రుఁడు, చండుఁడు, అమర్కుఁడు, ప్రహ్లాదుఁడు, బాలురును భుజబద్ధులైయుందురు. ఆస్థాన స్తంభములు మనోహరమైనవి కనుపించుచుండును. ఒకచో నురిమ్రాను కనుపించును].

సేవకా—జియ్యా! మేము మంచిపగ్గములతో నెన్నిమారులు నురివేయించినను బగ్గములు దెగినవి మాతప్పితము గాదు. ఈసారి యినుపసంకెలలఁ గట్టియున్నారము. ఇంక తెగుటకుఁ గారణము లేదు. మన్నింపుము. ఇదేమరల నెత్తెదము. (అని ప్రహ్లాదుని మ్రానికి నెత్తి నురివేయుదురు. యినుపసంకెల తుత్తునియలై క్రిందఁబడును. అందఱు నాశ్చర్యము నభినయింతురు.)

హిరణ్య—(గద్దియడిగివచ్చి) (స్వగతము).

ఉ. "ముంచితి వార్ధులన్ గదల మొత్తితి శైలతటంబులందు ద్రొబ్బించితి శస్త్రరాజిఁ బొడిపించితి మీఁదని భద్రకత్తిఁ ద్రొక్కించితి ధిక్కరించితి శపించితి ఘోరదవాగ్నులందుఁ ద్రొయించితిఁ బెక్కుబాధల నొనరించితిఁ జావఁడిదేమి చిత్రమో".



(ప్రకాశము).

### సీసమాలిక.

హిరణ్య— కాలాహితతులతోఁ గఱవంగఁ జేసినన్
జంపంగఁ బంచితిఁ జావవైతి

ప్రహ్లాద— గరుడవాహనమున నరుదారుఘనునకా
తుచ్ఛోరగంబులఁ ద్రుంచుటెంత

హిరణ్య— ఉడికించునగ్నిలోఁ బడఁద్రోసి కాల్చినన్
జంపంగ నెంచితిఁ జావవైతి

ప్రహ్లాద— తాపత్రయము లెల్లఁ బాపు ధీరునకును
చిటులుతమంటలఁ జల్లఁ జేయుటెంత

హిరణ్య— విలయంబుగా భూరిజలరాశి ముంచినన్
జంపంగ నెంచితిఁ జావవైతి

ప్రహ్లాద— కడగిఁ సంసృతివార్ధిఁ గడజేయువానికిఁ
దెలియఁగొంచెపువార్ధిఁ దేల్చుటెంత

హిరణ్య— పగమీఱ మదపుభేనుఁగుల చేఁద్రొక్కించి
చంపంగ నెంచితిఁ జావవైతి

ప్రహ్లాద— కరిరాజవరదుఁడై యరుదారువానికి
నీగజశక్తి మాయించుటెంత

హిరణ్య— వెగటుగా ససహావిషము ద్రావించినన్
జంపంగ నెంచితిఁ జావవైతి

ప్రహ్లాద— అలభోగిరాజశయానుఁడౌ విభునకు
నీయల్పవిషము మాయించుటెంత

హిరణ్య— కడఁగి మాయల నెల్లఁ గల్పించి భయపెట్టి
చంపంగఁ బంచితిఁ జావవైతి

ప్రహ్లాద— ఇలలోని యెల్లమాయలడంచువానికా
దనుజమాయల దీక్ష్ణపటిన గనెంత.

హిరణ్య— తే. గీ. ఎన్నివిధములనో నిన్నుహింసపెట్టి
చంపఁగాఁ బంపినను నీవుచావవైతి

ప్రహ్లాద— అసురనాయక నీకేల యజ్ఞభంగి
మాధవుని భక్తులకునెందు బాధగలదె.

హిరణ్య—ఓరీదురాత్మా! ఎన్నివిధములనో నిన్నుఁ జంపనెంచితి. విఫలమనోరథుఁడనైతి. నీకేమైన మందు మంత్రము తెలియునేమిరా చావకుండుటకు?

ప్రహ్లాద—అయ్యా! మందుమంత్రములేక యింతబ్రతికియుండుటకు సాధ్యమా? నా మందువిన్ము.

సీ. ఎల్లెడ సేవింపనుల్లసిల్లెడుమందు
మందులలో నెల్లమంచిమందు
పోలుపారభవరోగములను దీర్చెడుమందు
మందులయజ్ఞతమాన్పుమందు
కడుకొనియొందెనఁగానంబడెడిమందు
వెనుకం[illegible]ని లేక వెలఁగుమందు
పథ్యంబపథ్యంబుపలుకఁగోరనిమందు
వండకనూరకఁ బరగుమందు

తే. గీ. దనరుహరిపాదదీర్థంబు తప్పనింక
నొక్కయనుపానమును గోరకున్నమందు
అదియుఁ జెప్పెదనేమని యడుగుదేని
సమ్మదముమీరఁ దులసీదళమ్ము తండ్రి.

ఇంక నామంత్రమంటివా అదియుఁ జెప్పెదవినుము.

సీ. కమనీయసద్గుణ గణములకెల్ల నా
కర్షణమంత్రమై కాంతిమీఱు
భరియింపఁగారానిపాప సంతతికి ది
గ్బంధనమంత్రమై కదియనీదు



ఆనయంబు దుశ్చింతలను భూతతతికి ను
చ్చాటనమంత్రమై సడలఁజేయు
కామాదులగులోనఁ గదురుశత్రువులకు
మారణమంత్రమై మ్రందఁజేయు

తే. గీ. దానికి పురశ్చరణయును, దానములును
హోమమును జపమును శాంతియొకటి లేదు
రెండుమూఁడక్షరములలో నిండియుండు
నది[illegible] మాధవయను మంత్రమసురవైరి.

హిరణ్య—పాపకర్మా! మాధవ మాధవయని యూరకవదరెదవే? [illegible]ంతమున[illegible] వెదకివచ్చితినే, చిక్కియుండినఁ గుమ్మిచంపుచుంటినే? అప్పుడెక్క[illegible]నుండెరా? నిప్పుడెందున్నవాఁడురా?

ప్రహ్లాద—అయ్యా! ఎల్లకడలనున్నవాఁడు. నీయందు, నాయందు, చూచినపదార్థముల యందు. ఇందున్నవాఁడందున్నవాఁడని చెప్పనేల? ఎందుదలంచిన నందున్నవాఁడు.

కం. "ఇందుగలఁడందు లేఁడని
సందేహమువలదు చక్రిసర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందేగలఁడుదానవాగ్రణి[illegible]

హిరణ్య—(కోపమున) చూఁపగలవా వానిని? ఇందున్నఁ జూపుము. పొడసూపెనా వానిని, వానితోడనిన్నుఁజించిచెండాడెద. (అని చేపట్టియీడ్చును).

ప్రహ్లాద—ననుఁజూపమననేల? నేనీస్థలమనిచెప్పనేల? నీవేకోఁకొమ్ము. నీవేకనుఁగొమ్ము.

హిరణ్య—దురాత్మా! ఇదెచూడుమీ ఖడ్గము. దీనిలోవిష్ణువును జూపకున్నయిప్పుడే నీతలఁ దునుమాడెద, ఎందైననున్నాఁడా? ఈఖడ్గముననున్నాఁడా? ఈసింహాసనమున నున్నాఁడా? ఈదివియనున్నాఁడా? ఈస్తంభముననున్నాఁడా?

అనుబంధము 39.

ప్రహ్లాద—నీవడిగిన యన్నిటియందును, నింకనడుగఁబోవు నన్నిటియందునున్నాఁడు.

హిరణ్య—చూపకపొమ్ము. చూపరాకుటిలమానసా! ఈస్తంభమున? (అనిస్తంభమును జేతితో గట్టిగఁగొట్టును ఉఱుములు మెఱుపులు మహాధ్వనులు పుట్టును. మహాధ్వనితో స్తంభము రెండైపడును).

[ప్రవేశము: స్తంభము మధ్యమునను౦డి నృసింహమూర్తి].

హిరణ్య—ఔరా! నీవా నారాయణుఁడవు? ఇప్పుడెందుఁ దప్పించుకొనఁగలవు? (ఇరువురు యుద్ధమాడెదరు. నృశింహమూర్తి హిరణ్యకశిపుని గడపపైఁ బరుండఁబెట్టి ప్రేగులూడిచి హారమువేసికొనును).

[ప్రవేశము: (శీఘ్రగమనమున) నలువైపులనుండి లక్ష్మి, ఇంద్రుఁడు, శచి, దిక్పాలురు, ఋషులు, నారదుఁడు, బ్రహ్మ, సరస్వతి].

అందఱు—(చేతులు జోడించుకొని భయమునభినయించి నృసింహునివైపునఁజూచెదరు)

ఇంద్ర—దిక్పాలులారా! ఋషీంద్రులారా! ఇట్టిభయంకరాకారమెందును జూడను. పలుకరించుటకైన నుతించుటకైన సాధ్యముగాకున్నదే? ఎవ్వరీ నరసింహ హరిని మాటలాడింపఁగలవారు?

ఋషులు—ఎవ్వరికిసాధ్యమబ్బా! ఎవ్వరిచేతనుగాదు. ఇదేమాతల్లిలోకమాత రమాదేవి వచ్చియున్నది. ఆమెకైన సాధ్యమగునేమో?

లక్ష్మి—అయ్యలారా! నాచేతనుగాదు. నామనోహరునికిట్టియాకార మిట్టియాగ్రహ మెందెందు నెఱుఁగ. నేనిప్పుడు మాటలాడింపఁజాల.

ఇంద్ర—నారదా! నీవెప్పుడును రమారమణునొద్ద గానమొనరించి చనువుబడిసినవాఁడవు. నీవించుక యిపుడుమాటలాడింపరాదా?

నారదా—అబ్బా! యిదిగానమునకుకాలమా? మానమునిలుచునా? ఏమోయెప్పుడైన శాంతభావముతో నుండి యామహాత్ముఁడేనన్నింత వీణవాయింపుమన్న యటులయిటు చుంటేఁగాని నేనైమాటలాడించునంత చనువు నాకుఁగలుగదు. ఉండేఁబో నిట్టివేళనఁ పనికివచ్చునా? కాదు-నాచేతగాదు.

ఇంద్ర—ధాతా! నీవుకుమారుఁడవు. నీతల్లికాదనియె. నీకుమారుఁడు వలదనియె. నీకేల శ్రమ యీవలయునని యింతవరకూరకుంటిని. నీకింకఁదప్పదు.

బ్రహ్మ—దేవేంద్రా! కొంచమోర్చుకొనుఁడు. ఇప్పుడు సమయముగాదు. కొంచెము శాంతపడనిమ్ము.

## అనుబంధము 40.

ప్రహ్లాద—(నృసింహుని సమీపించి) మహాత్మా! నాయెడఁగల యవ్యాజకరుణచేఁగదా నామాటదక్కించితివి. నీదర్శనమువలని ధన్యత నాజనకుని మరణమువలనఁ గలిగిన దుఃఖమునుసహితము మాన్పించె. శరణాగతరక్షకా! ఇదేనమస్కరించువాఁడ (అని నమస్కరించును).

నృసింహ—కుమారా! లెమ్ము. నీభక్తికి సంతసించితి. (అనితలపైఁజేయిపెట్టును).

అందఱు—(కరతాళ ధ్వనులొనర్చి మంగళము పాడుదురు).

—) ప్రహ్లాదనాటకము సమాప్తము. (—

-❧-

# అనుబంధములు.

అనుబంధములు.

1. రంభ—రాగం-బేహాగ్-ఆదితాళము.

వింతాయెక్-విన్క సంతసమాయెనుగా
దేవేంద్రా సంతసమాయెనుగా సురనాథా
అసుఁగెనుదేవారి బెడిసపుఁదపమునఁగూడి వడిప్రాణంబెడబాసి ॥విం॥
మనసుననానందంబును మిగులఁగనీవొంద దనుజుండుమృతిఁజెందె ॥విం॥

లీలావని—రాగం-జంజూటి రూపకతాళము.

కటకటకటా నన్నెవ్వరు కావరారుగా।
కుటిలతతో నీచాత్ముఁడు గోడువెట్టఁగా ॥కట॥
అనాథనై యున్న నను మనసులోనను।
కనికరమే గణింపక కడఁగ తెచ్చెగా।
మనఁజాల శాపమింత మహినినుండఁ నే।
తనరంగా నన్ను బ్రోచి దయజూడరే ॥కట॥ ॥౧॥
అరణ్యమందెవ్వరునాదరంబున।
గరుణించినన్ను నేఁడు కాపాడరారే।
విరోధ మొంతయో పెంచినాఁడుగా।
ధరలోన నింతపాప కార్యమున్నదే. ॥కట॥

నారదుఁడు—గేయము.

మురాదిదానవ విరామ కేశవ పరాత్పరాభవ మోచనా।
హరాదివందిత ధరాధినాయక వరాంబుజాతవిలోచనా॥పల్ల॥
అపారనిస్తుల కృపాకరాభక్త పాపతతి విచ్ఛేదనా।
విపాకకారణ విపక్షనాశన సుపావనామధుసూదనా ॥పల్ల॥
దినాధిపాబ్జన యనారమావర వినాయకాంచిత వాహనా।
ఘనాఘనాంచిత వినీలవిగ్రహ సనాథలోకవిమోహనా

4. లీలా — రాగం-కాంభోజి ఆదితాళము.

తాపసపుంగవమా వింటికాదే।
పాపమొనర్చెను బాకవిరోధి ॥పల్ల॥
ఇంతయుఁగ్రూరత నెంచకయాలాగున।
పంతముతోనిటు బాధలఁజేసె ॥పల్ల॥

నార — ఈసతియాడినదే నిక్కమానె।
వాసవయింతటి పాపముకలదె ॥పల్ల॥
ధీరపతివ్రత యీరమణీమణి।
వైరముసేయఁగఁ గారణమేమి ॥పల్ల॥

ఇంద్ర — మానికులాభరణా యాలతాంగి।
నెనిటుతెచ్చుట నేరమెచెపుమా ॥పల్ల॥
వైరములేదీగర్భ బాలుఁడుక్రూరుఁడని।
కోరితినీమె కుమారువధింప. ॥పల్ల॥

5, విష్ణు — రాగం-హిందూస్థానిజంఝాటి రూపకతాళం.

మానులార వానికిక్ మంచికాలమిప్పుడు।
మంచికాలమిప్పుడు కొంచెమట్టులుండనీ ॥పల్ల॥
ధాతయొసంగినవరముల్ తలఁపవలదెనామదిలో।
చూతుఁగాకముందువీని జోలియిప్పుడేటికి।
జోలియిప్పుడేటికి నే తాళవలయునూరక. ॥పల్ల॥

6, ఇంద్రుఁడు — రాగం-సావేరి రూపకతాళము.

శ్రీవాసుదేవా మాధవా కావావెదాసుఁ।
భావంబునందు నిన్ను నేవేళనెంచెద ॥పల్ల॥
నీపాదనీరజాతముల్ జూపవెకూరిమిఁ।
గాపాడవేదయాకరా యాపన్నరక్షకా ॥పల్ల॥

7. విష్ణు — రాగం-హిందూస్థాని-మోహనకల్యాణి రూపకతాళము.

ఓసురగురుసురవరులారా వలదింక మనమునశంక ॥పల్ల॥
ఆతురమునఁదలకఁగనేలా చనుడింక మీపురివంక।



యిదిభరమనితలఁపకుఁడయ్యా హితులారా స్థిరమతులారా।
మదిలోనఁజింతమానుఁడు పోయిమతిరండు యింతచననిండు
మీమదిలో వెతపోనిండు. ॥పల్ల॥

8. లీలా — రాగం-జేగ్ ఆదితాళము.

రారాధీలోలా నాబాలా రాజితగుణజాలా ॥పల్లవి॥
కాలియందెలు ఘల్లనమ్రోయ బాలారమ్మిందు।
బిరబిర బాలారమ్మిందు బాలారమ్మిందు
తనయా లీలగనుఁగొందు ॥పల్ల॥ ౧
తటతటనందెలఁ తాళమువేసి యిటురారాపుత్రా।
గునగున నిటు రారాపుత్రా ఇటురారాపుత్రా।
తనయా హేమాంచితగాత్రా ॥పల్ల॥ ౧
రామకృష్ణకవి రత్నముఁబ్రోవఁ దామసమింకఁ।
దగదురా తామసమింక తామసమింకఁ।
తనయా తనుజితమీనాంక. ॥పల్ల॥

9. లీలా — శ్రీరాగం-రూపకతాళము.

సుకుమారా గుణశాలీ అకలంకాననలాలీ ॥పల్లవి॥
మదనసమాంచితరూప మానితనిర్జితపాపా।
నిదురపో చిటిపాపా నేపాడెదనిదుజోజో ॥పల్ల॥
జోజో ముఖజితచంద్రా సురదిరభోగజితేంద్రా।
జోజో తేజస్సాంద్రా శుభకరతనుఘనజోజో ॥పల్ల॥
లాలిసద్గుణజాలా లసమానాశ్రితపాలా।
లాలికవి రామకృష్ణ లాలితసురుచిరబాలా. ॥పల్ల॥

10. ప్రహ్లాద — రాగం-శంకరాభరణం-ఆదితాళము.

నారాయణభజ నంబు ధరలో సారంబైనదిగా ॥పల్లవి॥
నోరారంగను జేయఁగరాదే సారంబైనదిగా

పగలును రాతిరి మానక యుండక భజనము జనులారా।
మిగుల సంతసంబగు మదిలోనఁ వగవక చేయుండీ జనముల్ ॥పల్ల॥
వింతగు భక్తిని భజన మొనర్పఁడు వేగమె కేశవుఁడిల్।
సంతసమారఁ జింతలు దీఱ సల్పుఁడు మీ మదిలో జనముల్ ॥పల్ల॥

11. ప్రహ్లాద—రాగం-బేహాగ్ ఆదితాళము.

నా కన్నులారఁగాను నే నిన్నెందుఁ జూతునో।
నిన్నెందుఁ జూతునో నే నెన్నాళ్లు కాతునో ॥పల్ల॥
భూరిదయ మించి చెన్నార ననుం గాంచి।
నేరములు మన్నించి యో శౌరీ రమాధవా ॥పల్ల॥ ౧
బాలకుండటంచు నే పాప మెఱుఁగనంచు।
చాలదయ రావించి పాలింపు కేశవా ॥పల్ల॥ ౨

12. ప్రహ్లాద—రాగం-సురటి-ఆదితాళము.

మానసంబున కానందమాయె।
ఆనందమాయె బ్రహ్మానందమాయె ॥పల్లవి॥
కోరి కోరి చే పిలువ నారాయణా యన్న నామంబె చాలు ॥పల్ల॥ ౧
హరి నారాయణు దురితనివారణు।
గరుడశతాంగుని స్మరణంబు మీఱ. ॥పల్లవి॥

13. ప్రహ్లాద—రాగం బేహాగ్-ఆదితాళము.

జగములో దైవమీవే యీ జగములో।
మిగుల వెదకి కనుఁగొంటి మురారీ।
పగలనడఁచి పరమానంద మొసఁగఁ ॥పల్ల॥ ॥జగ॥
చింతలఁ బాసితి జేరఁగ వచ్చితి।
సంతసమారఁగ నీకడ కిపుడే।
సంతోషమారంగఁ గాపాడు శ్రీహరీ ॥పల్ల॥ ॥జగ॥
నీదయ నామీద నిండగ నొద్దును।
ఖేదము గల్గదు మానసమునకున్।
అదరమారంగఁ బాలింపు మాధవా ॥పల్లవి॥



14. ప్రహ్లాద—రాగం-కాఫి-ఆదితాళము.

సారసాక్ష నీ చరణకమలముల్ చేరికొలుతు శౌరీ శ్రీరమణా ॥గిరి॥
వైరివిదారీ పాపహారీ క్రూరదనుజవైరీ శ్రీరమణా ॥గిరిధారీ॥
కమలచరణా కాంతకరుణా వినుతచయ హరణా
విమలధామా వినుతనామా కమలావరనామా శ్రీరమణా ॥గిరి॥
సామజపాలా సద్గుణజాలా కామితబహులీలా
రామకృష్ణకవి రక్షణశీలా సామగానలోలా ॥శ్రీరమణా ॥గిరి॥

15. ప్రహ్లాద—రాగం-కాపీ-ఏకతాళము.

దీనార్తిపాలనా శ్రీనాయకా
శ్రీనాయకా హరి శ్రీనాయకా
మీనావతారా మానాయకా॥
వేదాంతవేద్యా కేశవా దామోదరా
నిత్యాదరా వనజోదరా
నీదాసుఁడను బాలింపుమా సాదరంబున
పాదాంబుజంబులన్ భక్తి మెయిన్
మోదంబు మీఱఁగ మ్రొక్కెదనే ॥శ్రీనాయక॥

16. ప్రహ్లాద—రాగం-కాఫి ఏకతాళము.

మన్నించి కావవే దేవా కరుణించి చేకొని మనవి
సేవించి వేఁడెదము నిన్నుఁ బాలించియీఁగదే భక్తి ॥పల్ల॥
నీ సమాన దైవము నెందుఁ గన రమారమణ నన్నిందు
నీ కుమారుఁడని సొంపొందు కరుణా కరుణమానకో
గోవిందా కలిత మానితాశ్రితబృంద. ॥పల్ల॥

17. ప్రహ్లాద—రాగం-నాథనామక్రియ ఆదితాళము.

కమలనయన శౌరీ కలుషహర కమలనయన
కమలవాసినీ కాంతమునివరా వనఘనదయాకర ॥పల్ల॥

సుర పాలనమనసిజ సుందరమాధవసదా
నీ లీలనుమనసునఁగొని యాడుదుముకదా
శ్రీలోలాశ్రితవారరంజన ॥కమలవాసినీ॥
నినుఁబాయనిభక్తినుతింతుఁగదా గిరిధరా
నారాయణాధరాధారాదానవహరా
మాయాతీతగుణాంచితాహరి ॥కమలవాసినీ॥

18. ప్రహ్లాద—రాగం-మాండ్ రూపకతాళము.

కలుషహరణ భువనభరణ జలజచరణ రా
దళితదానవ రా కలితగర్జర రా జలజనయన రా ॥పల్ల॥
దినాధిపతి చంద్రమా దివ్యలోచనా
అనాథరక్షకా మాధవా హరియోచనా
ప్రణుతపాలన రా వినుతసద్గుణ రా మనసిజపిత రా ॥పల్ల॥
కరీంద్రఘన రక్షణా సురపవందితా
సురారిహరా రామకృష్ణ సుకవివందితా
గరుడగమన రా నిరతపావన రా దురితమథన రా. ॥పల్ల॥

19. రాగం-కేదారగౌళ రూపకతాళము.

ప్రహ్లాద— తలఁపుమానఁగ తండ్రిసాధ్యమే దానవారిపేరు
మలఁగియొందు మానసవీధిని వెలసియుండగ విడవకుండగ.

లీలా— ఏలచేయఁగ నింతకోపము చాలుఁబ్రాణనాథ
బాలుఁడు వేఱేపాపమెఱుంగడు మేలుగల్గునె బాలకుఁజంపఁగ

హిరణ్య— వైరిగాకవాఁడుపుత్రుఁడే వారిజాక్షి క్రూర
యూరకయింత యోరిచికొంటిని నోరువజాలనేనూరకుమిాక

ప్రహ్లాద— అమ్మయిచేటికినడ్డముపల్కెదు సమ్మతిజెందుము చంపఁగరా
నిమ్ముగ శ్రీహరియే గలడేటికి నుమ్మలింపఁగ నూరకుతల్లీ:

హిరణ్య— కావరమంతయు గానగనయ్యెనె యేవగమానుదునీ
తులువన్ దేవిభీషివధింపకయుండిన భూవలయంబునఁబోవు
నాకీర్తి.



లీలా— మానుము నేటికినీనెత్తికోపముసూనుఁడు బాలుఁడు శుద్ధుఁడుగా
ప్రాణనాథ-వైరముచూపకు నెనుచేసెద వానికిబోధ.

20. హిరణ్య—రాగం-కాఫి ఏకతాళము.

విడిపింపు తలఁపోసి నీనిమతముఁ
విడకున్న నీనిఁజంప విధియింతునిక్కముగఁ
బడరానిబాధలింకఁ బడఁజేయువాఁడసతి. ॥పల్ల॥
భామరో నీకు కొడుకుండంగా
వలెనని నీమానసమునఁదలచితివే
తామసము మానవే దండించి
బోధించి వేధించి బాధించి సాధింపవే.

లీలా—మోహనకల్యాణి చాపుతాళము.

మానుము నాయనా యీనుతము కాన వేతండ్రికోపమున్నతము
బాలకయాతఁడు తాళఁడు కోపము చాలును పాపమగున్.

22, హిరణ్య—రాగం-శుద్ధబంగాళ ఏకతాళము.

నాతోసరిపోర యేరీవిపుల్ ధరానోని
ఎనున్ గొల్వంగా హరబ్రహ్మముల్ కడున్ రారోరి.
నాకంటె వేఱొక్కనాథుఁడున్నాఁడెయీ లోకము లేలన్
ఆకులతనుజెందు ఘననాకవాసులెందు
నాకుదాసులై నతులొనర్చుచున్నారే.
ఎక్కువమాటల నేటికినాడఁగ దక్కవు సుమ్మా
యెక్కడనెప్పుడైన హరి నెంచినంతలోన
చెక్కాడెదనీ యుక్కడంతుఁపోరా.

23. కాలనా—రాగం-మాండ్ ఆటతాళము.

ఓరీ దురాత్మా విరోధంబు తగునా
పార చూపు వధియింతుఁగదరా
పర్వతమునుండి పడద్రోతుఁగదరా.
మూఢా యింకైన నీ మురారి వదలరా

వీడకున్న నీ ప్రాణము పోవురా
గాఢముగాఁ గూపమునఁ బడెనురా.

24. ప్రహ్లాద — రాగం-కాఫీ రూపకతాళము.

వాసుదేవా పీతాంబరా పతంగవాహనా
శ్రీసతీపతీ చిత్రవర్తనా ॥పల్లవి॥
దేవదేవా జనార్దనా దినేంద్రలోచనా
భావనాతీతా భద్రదాయకా ౧
నారాయణా దామోదరా నగారిపాలనా
శౌరిగోవిందా శంభుసన్నుతా

25. నారద — రాగం-పీలు చాపుతాళము.

వారణ తారణ కారణభూరమా నాయకా పురందరపోషణా
వినుతరతీ ధన జనకా శౌరి ఘనగదాధారణా భూరమా
పరశమలా లయా భామా నాథా నిరంతర పావనాభూరమా.

26. రాగం-సావేరి ఆటతాళము.

లీలా— రాగతనయా బిరానకుమారా
నేరమెల్లను దయఁ నీవు మన్నించరా ॥పల్లవి॥

హిరణ్య— అయ్యా నా నేరమే మందు నింక
నెయ్యమంతా నీగి నినుఁ
అయ్యో నే నిటుల దెగటార్చఁగా
నంపితి నెకొంచమైనా గరుణలేకహా

లీలా— అన్న నీ ముద్దుమో మంద మారి నన్నుఁ డింకఁ జూచుదాన
నన్నుఁ [illegible]వంగ మాయన్నయుందె
నాయనా రాగదె నామది చెలంగఁగా.

27. ప్రహ్లాద — రాగం-సావేరి రూపకతాళము.

శ్రీవాసుదేవా మాధవా కావవే వానుని
భావంబునం [illegible] నే నేవేళ నెంచెద. ॥పల్లవి॥



నీపాదనీరజాతముల్ జూపవే కూరిమిఁ
గాపాడవే దయాకరా యాపన్నరక్షకా

28. హిరణ్య — రాగం-ఇంగ్లీషునోటు.

పోరా పాపీ బుద్ధివిహీనా క్రూరాచారా మదాస్పదా
తీరును మదమిఁక (నెదుటనిలువకురా) తెగనరికెదరా (వద వద)
విరోధినెంచెదె వీలుడివయ్యోవే దురాగతంబని తోఁచదురా
హరిహరియను నారడికూతలు మరుద్యమంబున (ద్రో)యకురా
సురారిశేఖరుల్ కరాళరీతిగా బిరాన వచ్చియీ
దురాత్మజుండుఁడీ కరుణింపఁ దగిగాదు.

29. నారద — రాగం-శంకరాభరణం ఏకతాళము.

తలపరె జనులు హిరణ్యకశిపుని దైవముగాఁగ
అలఘువిచారుని అంచితధీరుని ఆశ్రితమందారు
హరియెందుకో ఆహరుఁ డెందుకో మనహిరణ్య
కశిపుఁడె పురుషోత్తముఁడని పూజించినకడు పుణ్యం బేపారు

30. ప్రహ్లాద — రాగం-లతొంగి చాపుతాళము.

ఆ హరియే పరదైవమౌ హరియే॥ మారయధారుణిలోన ॥పల్లవి॥
దేహముల్ధరియించి తెలివింతగలవారు
దినదినమును గొల్వరాదె ॥ శ్రీహరియే ॥ ॥అను॥
పరమాదరమున భక్తులనెల్లను నిరతంబుఁ (బ్రో)చుఁగదా
హరిహరియని నామ స్మరణంబు సలిపిన
కరుణించు రామకృష్ణ కవినుతుఁడౌ శ్రీహరియే-మాహరియే

31. ప్రహ్లాద — రాగం-కేదారగౌళ రూపకతాళము.

దయ యేపారఁగా భవతాపము పోఁ మముఁ
గాపాడరావే శ్రీహరీ
నేను మాపాలనీకృపఁజూపుమఁ పాపములెల్ల బాపవే ॥అను॥
ఘనవిలాసము మీఱఁగాగల కాలమున్నదు భక్తితో
నినుభజించెడువారమో వర నీరజాయత లోచనా.

దినముచేయుదు నెంతయున్నమి దీనసిదగు సేవలన్
కనికరంబు చెలంగఁగా మముఁగావరావె రమాధవా.
మన మానందముఁ జెంది జానారఁగా దయరానీయవే
కరుణానిధీ.

32. ప్రహ్లాద—రాగం-అసావేరీ ఏకతాళము.

నీసరియెవరున్నారు హరీ యిల
కరుణతోఁనా శ్రితులఁగావఁగా
సరసిజాసనాద్యమరవందితా ॥నీసరి॥
దేవసన్నుతా దినమణినయనా
బ్రోవఁగరావే యనునరా
భావమందుని దలంతు నెపుడున్
శ్రీవరా మహా దేవపూజితా.

33. బాలకులు—రాగం-కాఫీ ఆదితాళము.

కరుణాలోకా వరశ్రీలోలా మముఁబాలింపవే దేవపాలా
ఉచితాలాపములను లాలించి మముచాలకృపనుగావరాదే
నీనామకీర్తనల్ నిరతంబుభక్తిచేమానసమునందునించి
యానందమారఁగా నందంబుమీఱఁగా వేసారకనినుగొల్చు
వారమోవరశ్రీనాథ దయమీఱఁబ్రోవవే

34. ప్రహ్లాద—రాగం-కాఫీ రూపకతాళము.

మురవైరి పాపహరా రావేననుఁగావఁగా
సరసిజభవహరముఖసుర సన్నుతవర నామహరీ ॥శ్రీ॥
స్వాంతములోననినున్ సన్నుతులన్ జేయుచుందున్
వింతగానీతనువున్ వేగతులన్ గనుచుందు
చింతలంబాపవయో శ్రీహరి నిన్ననుగొందున్
ఎంతయున్భక్తిని నే నెపుడున్ నీ కథవిందున్
వంతలుదీఱఁగ వాక్కులీలీరఁగఁజెంతకుజేరఁగ శ్రీరమణా



35. హిరణ్య—రాగం-మధ్యమావతి ఆదితాళము.

కడనూటయిదొక్కటికానీరా
విడిచెదా లేదో విష్ణునిచింతా ॥పల్లవి॥
కడికండలుగా గావించెదనీ
వడలిచావఁగా సారినెంచితివా
పిడుగులనడచెద మెడవిఱచెదరా
పొడిచెదనేనియ్యెడ నే కనరా

36. ప్రహ్లాద—రాగం-గౌరీమనోహర ఆదితాళము.

శ్రీవారణా పీతాంబరా ప్రీతిఁగావవే మాతల్లిని ॥పల్లవి॥
ఎల్లవేళ నిన్నెంచువాఁడనే నుల్లసిల్లమాతల్లిఁగావవే ౧.

37. ప్రహ్లాద—రాగం-నారోజు ఆదితాళము.

గోవిందదామోదరా నారాయణ
వనజాక్ష శ్రీనివాస ॥గోవింద॥
శ్రీమానాయక కామితదాయక
ప్రేమానుసంధాయక ॥నారాయణ-గోవింద॥ ౧
వేదవినోదన సాధుప్రసాదన
మాధవ మధుసూదనా ॥వనజాక్షగోవింద॥ శ్రీనివాస॥గో॥

38. బాలకులు—రాగం శంకరాభరణం ఆదితాళము.

కోరిభజింతుము గోవిందున్ మదినారాయణునిముకుందున్
నీరజనేత్రుని సారసనాభుని వారిజకన్యకానందున్
మానసమునందు మానానిభక్తివర దీనాది
హీరణాభ్యాసున్ శ్రీనివాసున్ జ్ఞానభాసున్ మీనాది
రూపవిలాసున్ కరుణానందమనోవికాసున్ ॥కోరి॥

39 హిరణ్య—రాగం-బిలహరి ఝంపెతాళము.

చూపఁగాగలవెయో శంఠహరిని ॥పల్లవి॥
చూపకుందువుసుమా పాపాత్మకా ॥అను॥
ఆనాఁడువైకుంఠ మంతయున్ వెదకితిని

కానఁరాఁడాయెనా కలుషాత్ముఁడు
హీనుఁడౌమాధవుం డెటుపోయెఁజెప్పరా
యేనాఁడుచేరెరా యెందుండెరా
దీనుఁడై యానముం దిగనాడిచనినవాఁ
డేనాటిదైవమురా యిటులాడఁగా

40. ప్రహ్లాద—రాగం-అఠేరి ఆదితాళము.

ధరలోనఁ గలడె నీసరిదైవ మరరే
సరసీజలోచనా సలలిత యోచన. ॥ధర॥
అరుదారఁగరుణించి పరిపాలింపగరాదే
పరమేశ రమావరసుస్థిరకరుణన్ బరమాదరణన్
వినయంబు నిండారఁగ నినువేఁడు కొనుఁవాడ
మనసారఁగ విని నీదయ మనుపంగ సురావె
నన్ను బ్రోవరె గనువేళ ఘనుఁడెవ్వడున్నాఁడు
వినిపించెదనా మనవిన్ వేగన్ వినుమా రామకృష్ణనుత.

మంగళం. రాగం—చక్రవాకం ఆదితాళము.

శ్రీవరా మునివినుతా శ్రితపరిపాలన నిగమకళా
దేవానందనా ధీరవినుత మంగళం
నీ అనుపమకరుణను నే వినుతిసలుపగలనా
యినశశివరనయనా ఘనాశ్రితాసనాధనా
జనార్దనా ఘనారినిచయ వినాశనా.
శ్రీలోల మముఁగరుణను పాలింపు తగమనుపులనాలించి
సుఖవనధిని దేలించి మించీ రామకృష్ణా పాలా.
మంగళంమగు ॥శ్రీవరా మునివినుతా॥

---

Printed at the Rama Vilasa Press, Bellary.

